# సుదర్శన్ రచనలు

To Sri. Jella Markandeya Garik
Affectionately
దేవులపల్లి సుదర్శన్‌రావు
30-12-2K2

విశ్వసాహితి
పోతుకూచి సరస్వతీ పీఠం

# సుదర్శన్ రచనలు


రచయిత :

దేవులపల్లి సుదర్శన్‌రావు



ఈశ్వర ఉగాది

ఏప్రిల్ 1997

ప్రచురణ :

విశ్వసాహితి

పోతుకూచి సరస్వతీ పీఠం

6-3-195, న్యూ బోయిగూడ,

సికింద్రాబాదు-3, ఫోన్ : 7533177

ప్రతులకు :

1) దేవులపల్లి. సుదర్శన్

విశ్వమాతాసదన్, శ్రీనగర్ కాలనీ (ఉత్తర),

ఎన్.జీ.వో కాలనీ ప్రక్కన— హన్మకొండ,

వరంగల్ జిల్లా.

2) విశ్వసాహితి చిరునామా

3) హన్మకొండ, వరంగల్ బుక్‌స్టాల్స్

ముద్రణ :

ఎ-1 ప్రింటర్స్, యం.కె. నగర్, ఓ. యు. క్యాంపస్

హైద్రాబాద్ - 7

**వెల రూ. 30/-**

# సుదర్శన్ రచనలు

విశ్వమాత పాద పద్మములకు

అమ్మా

భావము భవ్యమెల్లయు భవత్కృపయేయగు గాన నీవె నా
ఊహల నిల్చినన్ను నడిపించెడు శక్తివిగాన ఈ వచో
నైపుణియెల్ల నీదగు వచో విభవ స్ఫురణమ్మెగాన నా
భావమునందు భ్రాంతి పొడసూపగ నీయకుమెన్నడేనియున్

ఓ మ్

# స్వవిషయమ్

క్రీ॥శ॥ 1940 ఏప్రిల్ నుంచి ఇంగ్లీషు, తెలుగు, ఉర్దూ, హిందీ భాషల్లో రచనలు చేస్తున్నా సభలు, సమావేశాల్లో పాల్గొనటంగానీ, రచనలు ప్రచుర ణార్థం పత్రికలకు పంపుకోటంగానీ ఎఱగను. కాకపోతే కొన్నిసార్లు కొందరు సహృదయులు. మిత్రులు నాకు తెలియకుండానే పత్రికలకి పంపటం అవి అచ్చు అయి వచ్చాకగానీ నాకు తెలియటం జరిగింది.

అలాంటివానిలో "అమాయకుడి ఆరాటం" ఒకటి 1951 లో మా అన్నయ్య శ్రీ దేవులపల్లి వేంకటేశ్వరరావుగారు అనారోగ్యంతో హన్మ కొండలో వుండగా నేను వారి పరిచర్యల్లో తలమున్కలుగా వున్నరోజుల్లో శ్రీ జె. రాఘవేంధర్‌రావుగారు— ప్రస్తుతం ఉస్మానియా విశ్వవిద్యాలయ సామాజిక శాస్త్ర శాఖాధిపతి— చిన్ననాటి నుండి చక్కని కవితాధార గలిగి సామాజిక, రాజకీయ స్పృహతో అనేక కార్యక్రమాల్లో చాలా చురుకుగా పాల్గొనేవారు, వయస్సులో నాకన్న పిన్న అయినా విజ్ఞానతృష్ణగల ఔత్సా హికులుగా నాకు అతి సన్నిహితుల్లో ఒకరుగా వుంటూ వచ్చారు. ఈ రాఘ వేంధర్ రావుగారు నా "అమాయకుడి ఆరాటం" అనే రచనని తెలుగు స్వతంత్రకి, నా కొన్ని హిందీ దోహాలు హింది "ధర్మయుగ్" కి పంపటము, అవి ప్రచురించబడినాక సుమారు నాలుగు నెలలకు— ఈ మధ్యకాలంలో మా అన్నగారి ఆరోగ్యం పూర్తిగా క్షీణించి వారు దివంగతులు అయినందున నేను మా గ్రామం నుంచి హన్మకొండకు రావాలని కారణాన— నాకు తెలి యటం జరిగింది. "స్వతంత్ర" పత్రిక వారు నా శీర్షికను "భగవంతుడు అత డెవరో అగుపడితే బాగుండును" గా మార్చి ప్రచురించారు. ప్రచురణకు నోచుకున్న హిందీ దోహాలు వున్న "ధర్మయుగ్" ప్రతి నాకు దొరకలేదు. నేను చూడలేదు.

1977 ప్రారంభ మాసాల్లోనే అనుకుంటాను మిత్రుడు శ్రీ సి. హెచ్. వెంకట్రామరెడ్డిగారు అప్పట్లో హన్మకొండలో స్పెషల్ డి.ఎస్.పి. గా వుండేవారు. ప్రస్తుతం అడిషనల్ ఎస్.పి. గా రిటైరై హైద్రాబాద్, సయీదాబాద్ కాలనీలో వుంటున్నారు. నేను ప్రసిద్ధ హైదరాబాదు సూఫీకవి కీ॥ శే॥ శ్రీ సయ్యద్ అహ్మద్ హుసెన్ "అమ్జద్" అభిమానిగా ఆ మహాత్ముని అనేక కవితలు తెలుగుచేసి వారి సంక్షిప్త జీవిత సంగ్రహంతో నా చేతనైన స్థాయిలో తెలుగు పాఠక లోకానికి పరిచయం చేసిన వ్యాసంతోగూడా "ఆంధ్రభూమి" ఆదివారం సాహిత్యానుబంధం" లో వేయించారు. అయిదారేళ్ళ క్రితమనుకుంటా ప్రఖ్యాత ఉర్దూ కవి కీ॥శే॥ శ్రీ కాకోజీ కామేశ్వరరావు 'షాద్' గారి సహస్ర చంద్రదర్శనోత్సవం సందర్భంగా అచ్చువేసిన "వారి తెలుగు రచనలు" అను పుస్తకంలో వారి ఉర్దూ కవితలను నా తెలుగు అనువాదాలు అచ్చు అయినవి.

హన్మకొండలో నెలనెలా జరిగే మిత్రమండలి సమావేశాలకు తప్ప నే ఇతర సభలు, సమావేశాలను వెళ్ళను. యాభైయారు సంవత్సరాల దీర్ఘ కాలంలో నేను వ్రాసింది చాలా తక్కువ. ఆ కాస్త అయినా 'అమ్మదయ' తప్ప నేనంటూ వ్రాసానని విర్రవీగటానికేమీ లేదు. అందుకనే ఆ తల్లి నాకిచ్చింది ఆమె పాదాల చెంతనే ఉంచాను !

నేను కోరగానే తమ అమూల్యమైన అభిప్రాయాలు వ్రాసి యిచ్చి నన్ను పాఠక లోకానికి పరిచయం చేస్తున్న పండిత కవి మిత్రులు ఆచార్య కోవెల సంపత్కుమారగారికి, సహృదయులు మిత్రులు ఆచార్య సౌమిత్రి. లక్ష్మణమూర్తి గారికి పూజ్యులు, ప్రజాకవి, పద్మవిభూషణ్ కాళన్న గారికి, మిత్రులు సహృదయులు శ్రీ జంగా రాఘవేందర్‌రావు గారికి, నాపట్ల నాకే గల అశ్రద్ధని సరిదిద్ది నా రచనలు నా కోసం కాపాడిన మిత్రుడు శ్రీ నాగిళ్ళ రామశాస్త్రిగారికి, ప్రెస్‌కాపీలో అధిక భాగం

తన చక్కని హస్తలేఖనతో వ్రాసిపెట్టిన కోడలు శ్రీదేవికి, సుమారు అరవై యేళ్ళ నా సాహిత్య అజ్ఞాతాన్ని పోద్రోల సంకల్పించిన 'కవిగారు', మేనల్లుడు ఆకుమారు గోపాలకిషన్‌రావుకు, ఇంకా ప్రత్యక్షంగానో, పరోక్షంగానో నా జీవితంలోనూ, నా సాహిత్య వ్యాసంగంలోనూ నాకు సహాయ సహకారాలందించి ప్రోత్సహించిన అనేక సకల బంధుమిత్రులకు సర్వదా కృతజ్ఞుణ్ణి.

చివరగా ప్రాధాన్యతా క్రమంలో గాదు సుమండీ ! సాహిత్యంలో నా స్థానాన్ని నిర్ణయించగల పాఠక సోదరీ సోదరులకు హృదయపూర్వక వందనాలు !

పుస్తకాన్ని సకాలంలో సర్వాంగ సుందరంగా ముద్రించి తోడ్పడిన ఎ-1 ప్రింటర్స్, యం.కె. నగర్, ఓ.యు. క్యాంపస్ వారికి కృతజ్ఞతలు.

10-3-97

**దేవులపల్లి సుదర్శన్‌రావు**



# సుదర్శనం

ఇన్నాళ్ళకయినా శ్రీ దేవులపల్లి సుదర్శన్‌గారి కవితల సంకలనం వెలువడటం సంతోషంగా ఉంది.

నేను చదువుకొనే రోజుల్లోనే— అంటే 1948-49 ప్రాంతాల్లోనే ఆయన ఇంగ్లీషులో కవితా రచన చేస్తారనేది తెలుసుగాని, ఉర్దూలో, తెలుగులోకూడా ఆయన కవితలు చేస్తారనేది మాత్రం ఆ తరువాత చాలా కాలానిగ్గాని నాకు తెలియలేదు అందుక్కారణం తనను గూర్చి గానీ. తనకవితలనుగూర్చి గానీ ప్రచారం చేసుకొనే ఉబలాటం. పత్రికల్లో తనపేరు పడాలనే ఆరాటం ఆయనకు సహజ సిద్ధంగా లేకపోవటమే. ఆయన వేదికలెక్కి ఉపన్యాసలివ్వటం చూసిన, విన్న జ్ఞాపకం లేదు నాకు— ఇటీవలే పరమపదించిన కాళోజీ రామేశ్వర రావుగారి సంస్మరణ సభలో రామేశ్వరరావుగారి ఒక ఉర్దూ కవితకు తమ అనువాదాన్ని రుద్ధకంఠంతో వినిపించినప్పుడు వినటం తప్ప. సుదర్శనంగారు హనుమకొండ (వరంగల్) 'మిత్రమండలి' నెలవారీ సమావేశాలకే ప్రధానంగా పరిమితమయ్యారు. ఆయన తెలుగు కవితలను తొలిసారిగా నేను చూసిందీ, చదివిందీ 1969 లో వరంగల్ (హనుమకొండ) లోని 'స్వేచ్ఛాసాహితి' సంస్థ వెలువరించిన 'తిరుగబడు' కవితా సంకలనంలో మాత్రమే. మళ్ళీ ఆ తరువాత చూసిన గుర్తులేదు. అందుకే—

ఇన్నాళ్ళకయినా ఆయన కవితలు, ఒక చిన్న సంకలనంగానే అయితే నేంగాని, వెలువడటం సంతోషంగా ఉంది

సుదర్శన్‌గారు తెలుగులో రచించిన కవితలు చాలా తక్కువే. ఈ సంకలనంలో స్వీయ కవితలు కేవలం పన్నెండు మాత్రమే ఉన్నాయి. మిగిలినవి 'అమ్జద్' 'అన్వర్' రామేశ్వరరావు 'షాద్' వంటివారి ఉర్దు కవుల కవితలకు తెలుగు అనువాదాలు. స్వీయ కవితలలోని నాలుగు లోగా 'తిరుగబడు' లో చూసినవే. మిగతావాటిలో ఒకటి రెండు కవితలు పత్రికల్లో వచ్చి ఉండవచ్చు.

సుదర్శన్‌గారి కవితలన్నింటినీ గమనిస్తే; ఒకానొక వార్తతో, సన్ని వేశానికో సంఘటనకో తీవ్రంగా స్పందించటంలోంచి ఉబికి, అప్రయత్నంగా వచ్చిన కవితలే ఎక్కువ. ఉదాహరణకు 1987 లో తిరుమలేశుని సందర్శనం కోసం హఠాత్తుగా పడిన భక్తుల తొక్కిసలాటలో కొందరు చని పోవటంవల్ల కలిగిన తీవ్ర మనస్తాపానికి కవితారూపం 'ఏడుకొండల వాడికి విన్నపం'. ఇది ఒక వార్తకు సంబంధించింది కాగా, భారతదేశంపై చైనా మిత్రఘాతంగా చేసిన దురాక్రమణ సందర్భంలోని నెహ్రూ మానసిక వ్యధ నెపంగా సుదర్శన్ పొందిన మానసిక వ్యధకు భాషారూపం— 'నిర్మకుట చక్రవర్తి నిర్వేదం' మరి, 'కవిత్వం కాదిది' వంటి రచనలు శ్రీకాకుళోద్యమం కల్గించిన తీవ్ర ప్రేరణకు ప్రతిరూపాలు. ఈ విధంగా చూస్తే, సుదర్శనంగారి కవితలన్నీ 'వ్యథార్థ యదార్థ' రచనలే. ఈ ఆకస్మిక ప్రత్యక్షభాస రచనలను తెలుగులో ఆయన 'కవితలు' గా 'తీర్చిదిద్ద' టానికి ప్రయత్నించినట్లు కన్పించదు. తత్కాలోద్విగ్నతకు తన భాషారూపం అందించటమే ప్రధానంగా కన్పిస్తుంది.

ఈ కవితలన్నింటికీ ఇంచుమించుగా జీవధాతువొక్కటే- తనచుట్టూ ఉన్న సమాజంలో అనునిత్యం జరుగుతున్న అధర్మాలకూ, అసత్యాలకూ, అన్యాయాలకూ తీవ్ర వ్యథ చెందటం; ఈ వ్యథకు కార్యాచరణగా తిరుగబడటం, చెప్పుకోవటంలో ఇవి రెండంశాలుగా అనిపిస్తున్నా గూడా నిజానికివి ఒక నాణానికి రెండు పార్శ్వాలు మాత్రమే. ఒకటి లేక రెండోదానికి విలువ లేదు ఉనికి లేదు. అయితే ఇందుకోసం ఏ 'ఇజం' దగ్గరికో, ఏ 'వాదం' దగ్గరికోపోయి ఆశ్రయించనక్కర లేదు.

సారపు ధర్మమున్ విమల సత్యము పాపముచేత, బొంకు చే
పారము పొందలేక చెడబారినదైన యవస్థ, దక్షు లె
వ్వారలుపేక్ష చేసి, రదివారల చేటగుగాని, ధర్మ ని
స్తారకమయ్యు, సత్య శుభదాయకమయ్యును దైవముండెడున్

అంటారు భారతంలో తిక్కనగారు.

'....కృష్ణుని పాత్రలో వ్యాసుడు పలికించిన
యుద్ధనీతి నోసారి నెమరేసుకో !
అవ్యవస్థను గురించి ఆక్రోశించటం గాక
అంతమొందించటమే ఆశయమయితే
కావ్యాల కాల్పనిక లోకాల్నించి
కార్యరంగంలోకి రా...' (కవిత్వం కాదిది)

అన్న సుదర్శన్‌గారికి ఈ భారతోక్తి తెలియదనలేము. కృష్ణ-వ్యాసుల ప్రస్తావన ఇక్కడ కీలకాంశం. కాగా 1969 నాటికి అవగాహనతో ఆయన దృష్టి 'సాయుధ పోరాటం' మీద లగ్నమయింది ఇందుకు కలిగించిన ఉత్తేజన ఆనాటి శ్రీకాకుళ పోరాటం. అయితే, 'సాయుధ పోరాటం' ఈ విషయంలో ఎంతవరకు సఫలమవుతుందన్నది ఈ దేశ చరిత్ర తేల్చవలసి ఉంటుంది. కాగా, ఈ దేశంలో ఇప్పటివరకు సాగిన ఏ 'సాయుధ పోరాటం' గూడా, 1947 కు పూర్వంగానీ, ఆ తరువాత గానీ సఫలమయిన జాడ కన్పించదు, తెలంగాణా సాయుధ పోరాటం యొక్క సాఫల్య- అసాఫల్యాలు జగత్ ప్రసిద్ధమయినవే. అదట్లా ఉంచి, ఆనాళ్ళ అవగాహనతోనే '...కమ్యూనిజంలోని నిజాన్ని చూసి గాభరాపడి. .' ('దేనిమీద ?') అంటారు సుదర్శన్ గారు. కాని, ప్రపంచంలో ఆ 'నిజం' అమలులో ఎంత 'నిజం'గా ఉందో ఇవాళ్ల రహస్యమేమీ కాదుమరి.

సుదర్శన్ గారి కొన్ని కవితల్లో దేవుడూ, మతం గూర్చిన తీవ్ర వైమనస్యం ప్రస్ఫుటమవుతుంది. అయితే, నిజానికి, 'దేవుడున్నాడా' అనేది అసలు ప్రశ్నగానీ, సమస్యగానీ కాదు. ఈనాడు మనం అనుకొనే 'మతం' నిజానికి వైయక్తికమే గాని, సామాజికం కాదు. కాకపోతే, కొంచరు అధికారులూ, స్వార్థపరులూ, కుత్సితులూ దేవుడు, మతం అనబడే భావనలను ఉపయోగించుకొని, ప్రజలలోని విశ్వాసాలనూ, కొన్నిసందర్భాల్లో కొందరి 'అజ్ఞానా' న్నీ ఆసరాగా తీసుకొని సాగిస్తున్న దురాగతాలనూ, కపటత్వాలనూ చూసినప్పుడు మాత్రం ఆ దేవుడి మీదా, మతం మీదా వైమనస్యం కలుగటంలో అసహజత్వంగానీ, ఆశ్చర్యంగానీ ఏమీ లేదు. కాగా, ఇది 'నాస్తికుడు' మాత్రమే గాదు, 'ఆస్తికుడు' గూడా గర్హించే విషయమే.

'....మా మతము దేవుడున్నాడని కాదు, ఆ దేవుడుండనిమ్ము, చావనిమ్ము- సర్వమయిన సృష్టియందును ప్రాణము, జీవము, ఆత్మ కలకలలాడుచున్న దని మా పూర్వర్షులు చూచిరి. సర్వ వస్తుగత ప్రాణమును సమారాధించిరి....' అంటారు విశ్వనాథ సత్యనారాయణగారు (వేయి పడగలు పు. 687) 'సర్వ సృష్టియందు' అనే దట్లా ఉంచి, అసలు 'మనిషి' నే 'మనిషి' గా చూడలేని పరిస్థితి సమాసన్నమయినప్పుడు దేవుడు, మతం అనేవి, నిజానికి వ్యర్థం, సుదర్శన్‌గారు అచ్చంగా ఇట్లాగే భావించారో లేదో గాని-

మనిషిలో దైవత్వం
దేవుడిలో మానుషత్వం
కొసం నేనేనాడూ ప్రాకులాడలేదు.
..........................................
మనిషిని మనిషిగా మాత్రమే ప్రేమించేవాడికి
కనికరపు చూపూ, చిరునవ్వు తునుక సైతం
కరువై పోవటమన్నదే
నన్నీమధ్య నమిలి మింగుతూంది. (ఆకాంక్ష)

అంటారాయన. ఇది అసలు విషయం. ఈ 'సములుడే' దేవుడిని గూర్చిన తీవ్రవైమనస్యానికి నిజమయిన పునాది. నిజానికి మనిషి దేవుడూ కానక్కరలేదు. దేవుడు మనిషీ కానక్కరలేదు. మొట్టమొదట మనిషి 'మనిషి' అయితే, అంతే చాలు. ఆ మనిషి మానవత్వంలో, మహా మానవ త్వంతో, సమగ్ర - సంపూర్ణ మానవత్వానికి ఎదుగటమే సామాజిక సుస్థి తికి, సువ్యవస్థితికీ పునాది. ఈ మౌలికాంశం ప్రస్ఫుష్టం కావటం వల్లనే సర్వానర్థాలూ కలుగుతున్నాయి. ఈ పునాది లేక మరేది ఉండే ప్రయోజనం లేదు. అది ఉంటే మరేది లేకపోయినా గూడా ఫరవాలేదు. కాని, అసలుకే మోసం వచ్చింది. అందుకే ఇంత తీవ్ర వేదన, ఈ వేదన 'పుట్టబోయే ప్రాణి ప్రార్థన' లో విచిత్రంగా వ్యక్తమవుతుంది. కావటానికి మనిషే కాని, ఈ కావటానికి మాత్రమే 'మనిషి' అయినవారు ఈ సమాజాన్నే కాదు, ఈ లోకాన్నే కాదు సమస్తాన్నీ ఎంతకల్మశం చేస్తున్నారో, గందరగోళం సృష్టిస్తు

న్నారో, 'నరకం' చేస్తున్నారో ఈ కవిత వ్యంగ్యంగా చిత్రిస్తుంది. ఈనాడు సమాజాన్నే కాక జీవజాతికి చేస్తున్నదీ ఈనాడు విస్తృతంగా అనుభవంలోకి వస్తూండటంతో ఈ కవిత మరింత ప్రభావోత్పాదక మవుతున్నది.

కొన్ని కవితలలో కొందరు కవుల మీద విసుర్లు, ప్రతిక్రియాత్మక లక్షణం కన్పిస్తుంది. ఉదాహరణకు 'అమాయకుడి ఆరాటం' లో రవీంద్ర నాథ్‌ఠాకూర్ ఒక సందర్భంలో కష్టజీవి స్వేదకణంలో భగవంతుడున్నా డనటాన్ని— 'నిజం చెబుతున్నాను ప్రభూ! నాకందు (స్వేదం) లో ఏమిట్లో సరుమేడనో, ఏ జమీంవారు మేడనో తప్ప నీ డైనా కనపడింది కాదు' అంటారు సుదర్శన్‌గారు. 'కవిత్వం కాదిది' లో దిగంబర కవులు, దాశరథి, వరవరరావు వంటి వారిమీద విసుర్లు సులభంగానే కన్పిస్తాయి.

సుదర్శన్‌గారిలాగానే ఆయన 'కవితా భాష' గూడా చాలా నిరాడంబ రంగా ఉంటుంది. ఎదుటివాడితో నేరుగా మాట్లాడుతున్నట్టుంటుంది. అందు కని ఒక విధమయిన తెలంగాణా యాసలాంటిది అక్కడక్కడా స్ఫురి స్తుంటుంది. ఆయన స్వీయ కవితలన్నీ వచన (పద్యం) కవితా రీతిలోనే ఉన్నా, కవితా రూపాన్ని చెక్కాలన్న ప్రయత్నం లేకున్నా, పాదాద్యక్ష రాల సమానత్వాన్నో, ప్రాసనో పాటించాలన్న ధోరణి కన్పిస్తుంది.

ఒక విచిత్రం. స్వీయ కవితలన్నీ 'వచన కవితలు' కాగా, అను వాదాల్లో ద్విపదను విరివిగా ప్రయోగించారు. కొన్నాళ్ళు పద్యాల్లో యతి ప్రాసలు పాటించగూడదనే అభిప్రాయం ఉండింది. ఈ అభిప్రాయానికి వ్యాప్తి తెచ్చిన మహా విమర్శకుడు అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరుడు.

విశ్వేశ్వరరావు 'చిత్ర' అనే అనువాద పద్య నాటికలో యతిప్రాసల్ని పాటించలేదు. ఇట్లా కొందరు రచించారు. సుదర్శన్‌గారి తరహా ఆ కోవ లోనిదే. మరొకటి. స్వీయ కవితల్లో మాదిరి కాకుండా అనువాద కవితలలో వ్యావహారికేతర భాషను ఆయన ఉపయోగించారు. ఇది సుదర్శన్‌గారి కవితా 'రూప' లక్షణం. దాశరథి గాలిబ్ గీతాల అనువాదంలో గీతం, ఆటవెలది, ద్విపదలనూ, వ్యావహారికేతర భాషనూ ఉపయోగించారు. సుదర్శన్‌గారు ఈ అంశాన్ని గుర్తించే ఉంటారనుకుంటాను.

'అహమ్‌భావమ్' అనే కవిత మిగిలినవాటికన్నా విలక్షణమయిన కవిత. ఇందులో అంతర్ముఖమయిన విచార లక్షణం కన్పిస్తుంది. 'అహమ్' అంటే, 'నేను' అని మాత్రమే కాక 'అహంకార' మని గూడా అర్థం భావించబడింది.

'సత్యమయిన అసత్యం నేను
నిత్యమయిన అనిత్యం నేను
సకలార్థ సాధకమిద మహమ్
సర్వానర్థ మూలమిద మహమ్'

అన్న పంక్తులు ఆలోచనలను అంతర్ముఖీకరిస్తున్నాయి. సూఫీ తత్త్వ ప్రభావ రేఖలు వీటిమీద ప్రసరించటాన్ని సులభంగానే గుర్తించవచ్చు. ఈ విచారణ సుదర్శన్‌గారి మరొక పార్శ్వం.

ఇవన్నీ కావటానికి చాలా కొద్ది కవితలే అయినా, ప్రతిదీ ఒక అశాంత మనస్వియొక్క ఉద్విగ్నతకు ప్రతిరేఖ, పాఠకులను ఉద్విగ్నపరిచే భావ మయూరి.

ఈ సంకలనానికి ఈ నాలుగు ముందు మాటలు రాయటానికి నామీద ఆయనకుగల మైత్రీభావమే ప్రధాన కారణం.

**కోవెల సంపత్కుమారాచార్య**

10-12-96

15-9-68, రామన్నపేట,
వరంగల్-506002



# విశిష్ట కవితా మార్దవం

శ్రీ దేవులపల్లి సుదర్శన్‌రావుగారు సప్తతి వర్ష వయస్కులు. తెలుగు, ఇంగ్లీష్, హిందీ, ఉర్దూ భాషలలో నిష్ణాతులే కాక సంస్కృత పారశీక భాష లయందు చక్కని పరిణతి కలిగినవారు. సునిశిత విమర్శ పాటవము కలవారు. ఇంగ్లీష్ సాహిత్య మార్దవం, ఉర్దూ కవితా పేశలత వారి తెలుగు కవిత్వంలో గోచరిస్తుంది. సామాజిక పరిస్థితులను అవగాహన చేసికొని అవినీతిపై అన్యాయాన్ని ఎదిరించవలెననే ఉద్వేగం పుష్కళంగా ఉన్నందున వారి కవితలో వ్యంగ్యం సర్వత్రా స్ఫురిస్తుంది.

శ్రీ కాళోజీ రామేశ్వరరావుగారు 'షాద్' గా ఉర్దూలో వ్రాసిన అత్యుత్తమ కవిత్వాన్ని వారు సముదాత్తంగా తెలుగు చేసినారు. రెండు భాషల అంతస్తత్వాన్ని సందర్శించిన వైశారద్యం శ్రీ సుదర్శన్‌రావుగారి అనువాదంలో కన్పిస్తుంది. తెలంగాణా నిజాం పరిపాలన వశాత్తు ఉర్దూలో విద్యాభ్యాసంచేసి, ప్రొఫెసర్ గోకాక్ వంటి మహానుభావుల అంతేవాసిత్వంలో ఇంగ్లీషను తలస్పర్శిగా అధ్యయనం చేసినందున శ్రీ సుదర్శన్‌రావుగారి సాహిత్య వ్యవసాయం విశిష్టంగా ఉంటుంది. వారి కవితా సంకలనం ఆలస్యంగానైనా ముద్రించి పాఠక లోకానికి అందించే ప్రయత్నం చేయడం ముదావహం.

**ప్రొఫెసర్ లక్ష్మణమూర్తి**
కాకతీయ విశ్వవిద్యాలయం

హన్మకొండ
10-12-97

# కాళన్న మాట

మనకు ప్రతిరోజు ఉదయం నిద్రనుండి మేల్కొన్నప్పటి నుండి మళ్ళీ రాత్రి నిద్రపొయ్యేదాకా ఎవరెవరిదో దర్శనం లభ్యమవుతూనే ఉంటుంది. ఆ దర్శనాల్లో 'సుదర్శనం' అని చెప్పకోదగ్గవి ఎన్ని ? సామాన్య జగత్తువలెనే సాహిత్య జగత్తులో కూడా మనం దర్శించే కావ్యాలు, రచనలు దర్శనమిస్తుంటాయి, వాటిల్లోకూడా సుదర్శనం జరిగిందని చెప్పకోదగ్గవి అరుదే. సుదర్శనంగా భావింపదగ్గ వక్తయినా, వ్యక్తి కావ్యమైనా పంతం బట్టి అజ్ఞాతవాసం చేస్తే సుదర్శనం జరగడం అనూహ్యం అసంభవం. నిజం పలికేవాడే దొరకని మన సమాజంలో ఎన్నో చేదు నిజాలను చెప్పినవాడు చెప్పతున్నవాడు దేపులపల్లి సుదర్శన్‌రావు. "సుదర్శన్ రచనలు" అనే పేరుతో వెలువడుతున్న ఈ పుస్తకం ద్వారా మనకు దర్శనమిస్తున్నాడు. ఆ దర్శనం 'సు' దర్శనం కూడా. అది రచయిత పేరుకు తగ్గట్టున్నది.

"నీవై రాయిలో నీ రూపాన్నే చెక్కుకుని, దేవుడని చెప్పకుని
నిన్ను నీవే వంచన చేసికొని, నీడల్లో మేడల్లో దేవులాడి
దేబెలా, వాడెవడో ఎక్కడో ఉన్నాడని ఒకడంటే—
పెద్ద సున్నాచుట్టి లేదన వేరొకడు"........
ఆస్తి నాస్తుల కుస్తీపట్టుల్లో పడి నలిగి చస్తున్నదంతా మీ
చావస్తం" — 'ఆహ్వానం'

మనుషుల మాయోపాయాలు చూస్తుంచే
మనిషిలో సాక్కల నమ్మకం వమ్మైపోదుగదాని భయం వేస్తుంది
మనిషిని నమ్మజాలని నైచ్యానికి పతనం కాకముందే
దేవుళ్ళకేసి తిరిగే దైన్యానికి దిగజారకముందే
ఉన్నట్టుండి ఊపిరాగిపోతే బాగుండుననిపిస్తుంది
—'ఆకాంక్ష'

....రెక్కల కష్టానికి బుక్కెడు బువ్వనైతం అందనివ్వని
వ్యవస్థీకృత దుర్వ్యవస్థమీద
అందీ అందని అధికారపు ద్రాక్షలు జాపి
ఆశ్రిత బంధుజన పక్షపాతపు అజ్ఞానాన్ని
కులమత తత్వాల కుళ్ళునీ
ఊరూరా వాడవాడలా పంచుతున్న ప్రజాస్వామ్యం మీద
........తిరగబడు !.... —"దేనిమీద"

చావుని జయించాలన్న ఆవేశంలో అమృతం తాగేసా
భావనాతీతంగా పనిచేసిందది. చావు అజరామరమైపోయింది !
మిన్నూ మన్నూ ఏరాశి కాదెవడొక్కడిదీ
అన్నం బట్టా అందరి హక్కు
గట్టిగా అంటే కమ్యూనిజమ్, పట్టించుకోకుంటే ప్రజాస్వామ్యం"
—"తళుకులు"

రొట్టెముక్కకీనాటి నీ ప్రపంచంలో రెట్టింపు విలువున్నదీ నీకన్న
వ్యక్తి మనుగడకు శక్తి కావాలంటే శరీరంలో రక్తం వుండాలె
రక్తం కోసం భుక్తి అవసరం.... అయినపుడు
భుక్తికోసం రక్తం అయినా చిందిస్తాం
ఇదీ మా మతం నేటి కర్మ సిద్ధాంత స్వగతం'
—"అమాయకుడి ఆరాటం"

కూలివాని ఫాలం నుండి జాలువారే చెమ్మటలో చూడమన్నారునిన్ను-
మా టాగోర్- మా గురు దేవుడు....
నిజం చెబుతున్నాను ప్రభూ !
నాకందులో ఏమిల్లోనరుమేడనో ఏ జమీందారు పీడనో తప్ప
నీ నీడైనా కనపడింది గాదు......
కరుణామయుడివి,

సివలాంటి నరకంలో, పీడనా దక్షుల నిర్మిత ఘర్మ నరకంలో
కలవనుకోలేదు

—"అమాయకుడి ఆరాటం"

అవ్యవస్థని గురించి ఆక్రోశించడం కాక
అంతమొందించడమే ఆశయమైతే
కావ్యాల కాల్పనిక లోకాల్నించి కార్యరంగంలోకి రా

—"కవిత్వం కాదిది"

రాజకీయరక్త వమనాల్లో తడిసి రంగులు మార్చుకున్న
కాగితప్పువ్వుల్ని కంపు గొడ్తున్న నవ్వుల్ని
ప్రకృతి శోభావాహినుల్తో ప్రక్షాళనం చేస్తాను

—"విలయ విన్యాసం"

అందుకే అంటున్నాను.....
కవులుగా, కళాకారులుగా కలలుగని కలవరించి, పలవరించకండని
అవిద్యనూ అజ్ఞానాన్నీ అంతమొందించ దీక్షగొనండని
అధ్యాపకులై ఉద్యమం నడపండని !

—"విలయ విన్యాసం"

వేదనలఁ గుమలె నన్నేడిపించి తాను శాంతి గోల్పోయె
నన్జ్వలియించితాను
మంటనన్గల్పి తామంట గలిసిపోయె భళిర ! గెలుపన్ననాదె
యోటమినగూడ

—'అమ్జద్' కు తెలుగు సేత'

బాధలన్నిటివంతు దీరెను బ్రదుకనింకేమున్నది ?
ఉన్న పళమున నూపిరాగుట యొక్కటే మిగిలున్నది !

'గాలిబ్' కు తెలుగుసేత

అతడు నవ్వుకొనును ఆత్మ సంతృప్తికి
ఒరులజూచి యోర్వలేక గాదు
తనగార్చు కన్నీటఁ దడిసిన వలువనే
కాసగాలేని కబోదియతను

-'అంధుడు' అనువాద కవిత

సుఖసౌధముల నెల్ల సొంతమే గూల్చుకొని
శిధిలాలజూచి కడు చింతించి యేడ్చేము

కాళోజీ రామేశ్వరావు 'షాద్' కు తెనుగుసేత

చనిరి యెందరో జనుల జాగృత మొనర్చి
మనిషి మాత్రము మనిషి గానేరడాయె

-'షాద్' కవితకు తెలుగుసేత

ఎన్నికలవేళ వాడెంత గొప్పోడు-ఓటున్న ప్రతిపౌరుడు ఒక చక్రవర్తి
ఆ క్షణము గడిచెనా అన్నార్తివాడు తనదేశమున తానె శరణార్థివాడు
తానోడు - నేతలను గెలిపించు జనత, తనది తాగుడుచుటే
గణతంత్ర ఘనత

'షాద్' కు తెలుగుసేత

పైన పేర్కొన్నవి దేవులపల్లి సుదర్శన్‌రావుకావ్యంలోని కొన్నికవితలు.

1940 ల నుండి (దాదాపు అరవై ఏళ్ళు) తెలుగు, ఉర్దూ, ఇంగ్లీషు, హిందీల్లో రచనలు సాగిస్తూ తాను జీవిస్తున్న సమాజం అదే మాదిరిగా ప్రపంచం అంతటా వేరు వేరు చోట్ల రకరకాల వర్గాలుగా, వర్ణాలుగా, తీరు తీరు మతాల సంప్రదాయాల అనుయాయులుగా రాజకీయ వాదులుగా ముఠాలుగా మానవత్వం కోల్పోయి స్నేహభావం లోపించి కుట్రలకు ద్వేషాలకు గురై జీవిస్తున్న మానవమాత్రులందరినీ దృష్టియందుంచుకొని మానవత్వం చేకూరాలని స్నేహం - పరస్పర స్నేహం ఏర్పడాలని, ప్రతివ్యక్తీ తాను మానవునిగా జీవించే ప్రయత్నం చేస్తే ఎదుటివానితో స్నేహంగా వర్తించుటకు ఎదుటివాడిని మానవుడిగా భావించాలని కోరికతో వున్నవాడు, దాని కోసమే రచనలు సాగించినవాడు దేవులపల్లి సుదర్శన్.

ప్రస్తుతం మానవుని బ్రతుకు ఎంత దుర్భరంగా వున్నదో, దానికి కారణాలేవో ఈ పుస్తకంలోని ప్రతి రచనలో చేదు నిజాలుగా దర్శన మిస్తాయి. దాదాపు ఆరు దశాబ్దాలు ఈ చేదు నిజాలను, మహా సత్యాలను దేవులపల్లి సుదర్శన్ తనకు అత్యంత సన్నిహితులు అని అనిపించిన వారికే వినిపించి వుంటాడు. అటువంటి వారు ఒకరిద్దరు. ఒకరు జంగా రాఘవేంద్రరావు ఉస్మానియా విశ్వవిద్యాలయం సోషియాలజీ ప్రొఫెసర్ వరంగల్ వాసి. ఇంటర్మీడియేట్ వరకు ఇక్కడే చదివినవాడు. కవికూడా. విద్యార్థి దశనుండి మిత్ర మండలిలో పాల్గొని తన రచనలు విన్పించిన వాడు. రెండవవారు సి.హెచ్. వెంకట్రామరెడ్డి రిటైర్డ్ ఎఎస్పి ఈ ఇద్దరి ద్వారా 'తెలుగు స్వతంత్ర' లోనూ, హిందీ ధర్మయుగ్‌లోనూ సుదర్శన్ ఒకటి రెండు రచనలు ప్రచురించబడ్డాయి. అదైనా ఆ మిత్రులు సుదర్శన్‌కు తెలియకుండా చేసిన ఘనకార్యం, సుదర్శన్ తన స్వభావాన్ని బట్టి ముందే తెలిస్తే వారిని ఆ పని చేయనిచ్చేవాడు కాదు. 'స్వవిషయం' లో దాదాపు 30-35 సంవత్సరాల తర్వాత సుదర్శన్ మనకు తెలియచెప్పుతున్నాడు. ఇష్టపూర్వకంగా ఏ సభలోనూ సమావేశంలోనూ పాల్గొనని వ్యక్తి అతడు. అటువంటి సుదర్శన్ 'మిత్రమండలి' సమావేశాలకు మాత్రం ఇష్టపూర్వ కంగా వస్తుంటాడట (స్వవిషయం). ఇది మిత్రమండలి సౌభాగ్యం. ప్రత్యేకంగా కాళోజీ సోదరుల యెడల సుదర్శన్ కనబరచిన స్నేహాదరణ.

మన సమాజంలో సాధారణంగా వ్యక్తులకు వారి శక్తి సామర్థ్యాలకు మించిన పేరు ప్రతిష్ఠలు లభించేడం జరుగుతుంది. అదే విధంగా అన్ని రంగాల్లోనూ అన్నివిధాల శక్తి సామర్థ్యాలు గలవారు అజ్ఞాతంగానే వుండి పోతారు. అజ్ఞాతంగానే వుండిపోవాలనే సంకల్పంతో తమ శక్తి సామర్థ్యంతో చేయగల్గిన పనిని చేస్తూ జీవితం గడిపే మహానుభావుల పరిచయం గుర్తింపు ఎవరికీ లభ్యంకాదు. గుర్తింపు రాలేదనే చీకూ చింతా ఆ మహానుభావులకుం డదు. అటువంటి వాడే సుదర్శన్. 1940 నుండి వివిధ భాషల్లో మహా మానవు నిగా, మహా మేధావిగా తన మనో భావాలను వెల్లడిస్తున్న సుదర్శన్ మొదటి సారి పుస్తక రూపంలో 1997 లో దర్శనమిస్తున్నాడు. అంతటి వాడిని తెలుగు సాహిత్య లోకానికి పరిచయం చేయించే భాగ్యంనాకు కల్గింది. ఈ విషయంలో కలుగుతున్న సంతోషంకన్న ఇన్నాళ్ళూ చేయలేకపోయానన్న బాధే ఎక్కువ.

సుదర్శన్ రచనల్లోని చేదు నిజాలు మనకు మింగుడు పడాలని, అమానుషం గానే కాదు పైశాచికంగా వర్తిస్తున్న మన బ్రతుకులు మానవత్వంతో స్నేహంతో వెలుగొందాలని ఆశిస్తున్నాను.

మిత్రమండలి సమావేశాల్లో తన ఇంగ్లీషు తెలుగు కవితలు వినిపించి నాడు. మిత్రమండలికి అతడు పరిచితుడే. ఉర్దూ సాహిత్యంలోని కొందరు కవుల కవితలను తెలుగు లోకాని కందించాడు సుదర్శన్. ఆ సాహిత్యం లోనైనా ఆ కవులలోని తనకు నచ్చిన కొందరు కవుల ఏరికోరిన రచనలు కొన్ని మాత్రమే తెలుగులోకి అనువదించాడు. మిత్రమండలికి చెందిన వయో వృద్ధులైన కాళోజీ రామేశ్వర్రావు 'షాద్' కవితలు కొన్నింటిని అనువదించి వారి సహస్ర చంద్ర దర్శన ఉత్సవ సందర్భంగా ఉత్సవ కమిటీవారు వెలు వరించిన 'రామేశ్వర్రావు తెలుగు రచనలు' లో ప్రచురితమైనాయి. సూఫీ మహాకవి అహ్మద్ హుసేన్ 'అమ్జద్' హైద్రాబాద్ కొన్ని కవితలు సి. హెచ్. వేంకట్రామరెడ్డి రిటైర్డ్ ఎఎస్‌పి గారిద్వారా సుదర్శన్ వ్యాసంగా 'ఆంధ్రభూమి' సాహిత్యానుబంధంలో వచ్చినవి.

ప్రస్తుత పుస్తకంలో ఉర్దూ కవితల అనువాదాలు కొన్ని ప్రచురించ బడడం విశేషం, సంతోషం.

చివరిమాట. రచన ఆరంభంలో ఈ 'వచోనైపుణియెల్ల నీ దగువచోవిభవ స్ఫురణమ్మె గాన నా భావన యందు భ్రాంతి బొడసూపగ నీయకు మమ్మా ఎన్నడేన్' అని అమ్మా అంటూ విశ్వమాతను కోరినాడు సుదర్శన్. ఆయన కోరిక తీరాలనే నా కోరిక.

**కాళోజీ నారాయణరావు**
నక్కలగుట్ట
వరంగల్

హనుమకొండ
14-12-1996

# తమ్ముని తదాత్మ్యం

నన్ను తమ్ముడూ అని పిలువకున్నా శ్రీ దేవులపల్లిసుదర్శన్ నా అన్నయ్యే! పుట్టి బుద్ధి యెరిగిన నాటినుండి ఆయనను అన్నయ్యా అనే పిలుస్తునాన్నను—చిన్న మేనమామయ్యే అయినా! తను తన అన్నయ్యను —నా పెద్ద మేనమామయ్య కీ॥శే॥ దేవులపల్లి వెంకటేశ్వరరావు (దేవేరా) గారిని అన్నయ్యా అని పిలుస్తుంటే నేనూ ఈయనను అన్నయ్యా అని పిలిచేవాణ్ణి— వాళ్ళింట్లోనే నా బాల్యం చాలా వఱకు గడిచినందువల్ల.

తాతయ్య అమ్మమ్మలు శ్రీ దేవులపల్లి కేశవ రంగారావుగారు, శ్రీమతి అండాళమ్మగారు ఇద్దరూ ప్రేమ మూర్తులే. పైనుదహరించిన వారి కుమారులిద్దరూ వారి అడుగుల జాడల చరించిన వారే ఆ విషయంలో. తాతయ్య అమ్మమ్మల ఏకైక కూతురు మా అమ్మకూడా స్వభావతః అంతే!

జ్ఞాతి వైర కారణాలవల్ల ఒకే రక్తం పంచుకొని పుట్టినవారే ఒకరిపై నింకొకరు ఈర్ష్యా ద్వేషాలు విషాలు చిందించుకొంటున్న యుగంలో తమ్ముడు కాని తమ్మునికి నాకు అడగకుండానే తన మేధా బలాన్నంతటినీ ఒక స్నేహితుడూ, ఒక వేదాంతి మఱియు ఒక మహా చక్కని మార్గదర్శిగా పంచిన అన్నయ్య శ్రీ దేవులపల్లి సుదర్శన్.

తన అన్నయ్య దేవేరా, నా అన్నయ్య సుదర్శన్ ఇద్దరూ మేటి చతుర్భాషా పండితులేయగుట చిన్ననాడీ తమ్ముని ఆనందానుభూతి కవధులు లేని విషయం. తన్మయతకు కారణం. అది యెందుకో ఆనాడు తెలియనిది. కాని అప్పుడే శ్రీ దేవేరా నన్ను 'కవిగారూ' అని పిలిచే తీరు నన్ను వెర్రి మొహం వేయచేసినా 46సంవత్సరాల తరువాత నేనూ ఓ కవిననిపించుకోవడం ఆయన వరం 'కవిగారు' నా కలం పేరు కావడం బహుశః చిన్ననాటి నా ఆ తన్మయత్వానికి కారణమేమో అనిపిస్తున్నది.

అదేమో ఆధినుండి సరస్వతీదేవి ఇతరుల దయాదాక్షిణ్యాల మీద ముఖ్యంగా లక్ష్మీదేవిపై తనకళాకౌశలాలు ప్రతిభాపాటవాలు చాటుకోవడానికి ఆధారపడియుండవలసి రావడం బాధాకరం.

పూర్వకాలములో కవులు తమ కృతులను రాజుల కంకితంచేసి వారి కనుసన్నలలో తమ కవితా పాండిత్యాలను ప్రచారించుకొనేవారు కాల గర్భంలో కలువకుండా చూచుకొనేవారు. ఆ కాలంలోనే కర్ణాటకిరాట కీచకుల కమ్మనని సరస్వతీదేవికి దాస్యవిముక్తి కలిగించ పట్టుపట్టి పంతం నెగ్గించుకొని కూడా తన పాండితీ; కవితా మందార మకరందం కనుమరుగవకుండా చూచుకొన్న మహానుభావుడు శ్రీ బమ్మెర పోతన ఒక్కడే నేమో! ఆయనకు శ్రీరామునిపై యున్న అచంచల విశ్వాసమే బహుశః దీనికి కారణమై యుండనోపు.

తరువాతి కాలంలో ఎందరో బహు భాషా కవులు, పండితులు ప్రాపు దొరకని కారణాన ఘనమైన వ్రాతలు వ్రాసికూడా కనుమరుగైనారు. ఏ హానవతా దృక్పధమున్న పబ్లిషర్లో, ఏ మంచి స్నేహితులో లేక వారి వ్రాతలు వారి చుట్టూరా ఖననమైనవి. మహత్తరమైన సాహితీ సంపద యిలా కనుమరుగైపోవడం మహా దారుణం.

అలాంటి ఇద్దరు రచయితలే శ్రీ దేవేరా మరియు శ్రీ సుదర్శన్ సోదరులు. ఇద్దరు చతుర్భాషా పండితులైనప్పటికి—దేవేరా పోతనలా మహాత్మ్యంగా నిర్వచనోత్తరాంధ్ర మహా భాగవతం వ్రాయగల్గియు, సుదర్శన్ కీట్స్, షెల్లీ, మరియు బైరన్‌ల సమానంగా ఇంగ్లీషు రచనలు చేయగల్గియుండియు లక్ష్మీదేవి వీరి యెడల అర్ధ నిమీలిత నేత్రయౌట వీరిలోని సరస్వతీదేవి కనుమరుగగుటకు కారణమైనది. అతి వ్యయప్రయాసలతో దేవేరాగారి "ప్రతిధ్వనులు" అనే ఖండకావ్యమచ్చయినా తను 32వ యేటనే కీర్తిశేషుడైనందున ఆయన నిర్వచనోత్తరాంధ్ర మహా భాగవతము పాఠకులను చేరనేలేదు : కనీసం వ్రాతప్రతి కూడా లేనిది ప్రస్తుత పరిస్థితి.

ఇక మొదటినుండి ప్రచారం గిట్టని శ్రీ సుదర్శన్ రచనలుకూడా 50 సంవత్సరాలకు పైగా వెలుగు చూడలేకపోవటమేకాక ఆయన ఇంగ్లీషు కవితలు శంకాస్వాంతుల చేతబడి మోసపోవడం బాధాకరం. అ రచనలు కూడా త్వరలో వెలుగు చూడబోతున్నందున ఆనందపరవశుడనౌతున్నాను.

50 సంవత్సరాలలో అనేకానేక సందర్భాలకు స్పందించి వ్రాసినవి, ఇతర రచయితల దివ్య భావాలకు అనువాదాలైన కమనీయ కవితా జల్లులివి. వరంగల్‌లోని సాహితీ బంధువులు కీ॥శే॥ శ్రీ కాళోజీ రామేశ్వరరావు (షాద్) గారి ఉరుదూ కవితలనెన్నింటినో తెనిగించి ఆయన మన్ననలను, సుదర్శన్ అంటేనే ఆయన కవితలు సుదర్శనాలనేంత గొప్పగ కీర్తించిన సహజకవి కాళన్న మన్ననలను, ఆధునిక పండితమ్మన్యులు ప్రొ॥ శ్రీ కోవెల సంపత్కుమారాచార్య మరియు ప్రొ॥ శ్రీ లక్ష్మణమూర్తిగారలంతటి మేధావులచేత గొప్ప పరిచయ వాక్యాలందుకున్న నా అన్నయ్యను గురించి 22 నెలల కవి కుమారుడనైన నేను వారితో దీటుగా వ్రాయుధీశక్తి లేనందున కవితల రాశి వాసి పాఠకదేవుళ్ళకే వదులుతూ 70 యేళ్ళు దాటిన తరువాత ఒక రచయిత రచనలు ముద్రితమవడం బహుశః ప్రపంచంలోనే యిది మొదలేమోనని భావిస్తూ నా పరిచయ పరిధినింతవరకే ఆపుతున్నాను.

ఈ మధ్యనే 30వ నవంబరు 1996 నాడు శ్రీ"సినారె" కరకమలముల నుండి ఆవిష్కరింపబడ్డ నా "కవిగారి స్వగతాలు" కుటుంబ విషయిక కవితా సంకలనం (ఓ విధంగా **Lyrical Auto Biography**) లో అన్నయ్యగా ఆశీస్సులిచ్చిన వెనువెంటనే ఈ "సుదర్శన్ రచనలు" లో "ఈ తమ్ముని తాదాత్మ్యం" చోటుచేసుకోగలగడం నా అదృష్టమూ, మా యిద్దరి అనుబంధానికి ప్రబలమైన ప్రతీక, చిన్ననాటి ఆనందానుభూతికి పరాకాష్ఠ.

తమ్ముడు

**క వి గా రు**

(ఆకునూరి గోపాలకిషన్‌రావు)

"అమ్మకృప"

97 వాసవీకాలనీ

సికింద్రాబాదు-15

ఫోన్ : 7747882

25-3-1997

# సుదర్శనం - కవిత్వావలోకనం

కాలచక్రంలో ప్రకృతి' వస్తువులు, ఋతువులు, తరులు, గిరులు, ఝురులు, తారలు, పాలపుంతలు— సమస్త ప్రపంచం మారుతూనే ఉంటుంది. అది ఎప్పుడూ స్తబ్ధుగాఉండదు.అలాగే మనిషికూడా కనులు తెఱచినదిమొదలు మూసే వరకు శారీరక,మానసిక మార్పులకు లోనౌతూనే ఉంటాడు. అతనిలో చారిత్రికంగా యధార్థ చరిత్ర, ఆత్మ నిర్దేశితంగా వైయక్తిక చరిత్ర క్రమేపీ కానీ, అనూహ్య పరిణామాలవల్ల కాని మార్పు సంభవిస్తుంది. ఈ మార్పు అంతరాంతరాల్లోంచి వెల్లుబికి ధారగా వచ్చి కవితగా కెరటంలా ప్రత్యక్ష మౌతుంది.

చూస్తూ చూస్తుండగానే సుదర్శన్‌గారు వసంత, హేమంతాలు దాటి శరత్కాలంలో ప్రవేశించారు. ఆయనకన్నా నేను 15 ఏళ్ళు చిన్న. ఏడో దశకంలో ప్రవేశించాక తానొక దీటైన మేటి కవినని కనుగొన్నాడు! ఇది ఆయనకాశ్చర్యానందానుభూతి కావచ్చు. నాకు మాత్రం ఇందులో ఏ ఆశ్చ ర్యము లేదు. ఎందుకంటె నేను సుదర్శన్‌గారిలోని కవిని చూచి ప్రేరేపించి ఆనందించి 44 సంవత్సరాలు దాటింది. నేను తొమ్మిదవ తరగతిలో వున్న ప్పుడు చిరునవ్వులతో మొదలైన మా పరిచయం 44 వసంతాలు దాటి కవితా మైత్రీ సౌరభంలా పుష్పించింది. ఆ కాలంలో బాగా ప్రాచుర్యంలో ఉన్న గోరాశాస్త్రి తెలుగు స్వతంత్ర పత్రికలో వస్తోన్న అభ్యుదయ గీతాల గురించి చర్చించే వాళ్ళం. నాకు చర్చ, వాదం అంటే చిన్నప్పటి నుండీ చాలా ఇష్టం. నా దృష్టిలో వాదం, ప్రతివాదం, సమన్వయాల ద్వారానే సత్యం గోచరిస్తుందని నమ్మకం. ఇతరులెందరో కాక తర్కాన్ని ఆవేశానికి బలిచేయకుండా సుదర్శన్‌గారు నేను చెప్పిన విషయాలను ఓపికగా వింటూ తన అభిప్రాయ భేదాలను వెల్లడిస్తూ సహనంతో ప్రోత్సహించే తీరు నా కవితా మూర్తిమత్వానికి నారుకు నీరు పోసిందని చెప్పవచ్చు నా గురువు గారు టి.వి. సుబ్బారావుగారు, కాళోజీ నారాయణరావుగారు, కీ॥శే॥ కనక రత్నమ్మగారు, సుప్రసన్న, లక్ష్మణరావు, రాజలోచన్ మొదలగువారు నా

కవితా యజ్ఞానికి తోడుగాపండి ప్రోదినిచ్చారు. ఈ నిర్మాణంలో సుదర్శన్ గారు అనుద్దేశితంగా ఒక విశిష్టమైన పాత్ర వహించానిర చెప్పవలసి ఉంది. నేనా కాలంలో వ్రాసిన గీతాలలో లైఫ్ అంటే చిన్నయసూరి నీతి వాక్యాలు కావు. **Struggles, Contests, Combats** నిరీక్షణంలో ప్రతిక్షణం మన్వంతరంగా స్ఫురిస్తోంది, ఆశామయూఖాలు ఆఖరుగా హృదయ కోశంలో వెల్గుతున్నాయి" మొదలగు గీతాలు చాలామంది మిత్రులకీనాడూ కంఠస్థమై ఉండటం ఆనందాశ్చర్యాలు కల్గిస్తున్నవి!

ఆ రోజుల్లో సుదర్శనంగారు తన కవిత్వం చదువుతుంటే అలా చదివితే బాగుందునన్నంత ఆకర్షణీయంగా ఉండేది!

సుదర్శన్‌గారు మితభాషియైనా ప్రియభాషి. వారు వ్రాసిన రచనలలో నిహితమై ఉన్న వస్తువు శిల్పం ఎలాంటిది? ఎవరి కోసం వ్రాశారు ఎందుకు వ్రాశారు. వీటి జవాబుల్ని వెదుకుదాం.

సుదర్శన్ స్వాభావికంగా కవి మాత్రమే కాగలడు. ఆయనకు పదాలతో స్నేహం, భావాలతో దోబూచులాట, స్వాప్నిక లోకంలో దృష్ట సంపర్కం కిశోరా వస్తుండే వున్నవి. దేవులపల్లి వంశంలోనే కావ్యరచనా బీజాలు కొన్ని దశకాలుగా నిక్షిప్తమై ఉన్నాయి. వీరి దాయాదులలో పండితులు కవులున్నారు. వీరి అన్నగారు కీ॥శే॥ దేవులపల్లి వెంకటేశ్వరరావు (దేవెరా) గారితో నాకు స్వయంగా పరిచయముంది. ఆయన రచించిన చక్కని పద్యాల్ని విన్నాను. ఆనందించాను. ఈ ఉదాత్త, సృజనాత్మక వారసత్వాన్ని పుణికి పుచ్చుకున్న సుదర్శన్ సహజంగానే కవి అయ్యారు. ఈయన ఆర్తకవి, క్షుధార్త కవి కాదు. నిస్సందేహంగా సహజ కవి.

ఈ సంపుటిలో ఈయన అనువాదాలే ఎక్కువ చోటుచేసుకున్నవి. అవి చూస్తే మంచి భావుకతతో అల్పాక్షరముల కనల్పార్థం సృష్టించే శక్తి స్పష్టమౌతుంది. ఈ గీతాలను బాణీ కట్టి చక్కగా పాడుకోవచ్చు.

మచ్చుకు కాళోజీ రామేశ్వరరావు (షాద్) గారి ఉర్దూ కవితల అనువాదాలు రెండు చూడండి.

"కాలమా కడ తేర్చరాదే
కాని కాలము రాకముందే!"
"బ్రతుకు బరువై పోకముందే
మెతుకు కరువై పోకముందే!

ఎంత ఫీలింగ్, ఏమి భావుకత, ఎంత లోతైన తాత్వికత, ఏమి ఉదాత్త అర్థ గరిమ? ఈ పాటను ఎంతో సేపు అలాగే పాడుకోవాలని నా కనిపిస్తున్నది. ఎవరికైనా ఇలాగే అనిపించవచ్చు!

వీరి కవితలలో జీవిత కాలంలోని ఉద్యమాల ప్రభావం, స్వేచ్ఛాసిద్ధి సంఘర్షణ, వామపక్ష సోషలిస్టు భావాలు, దక్షిణ పక్ష సాంప్రదాయిక మతాను స్థాపక భావాలు, నమ్మశక్యంకాని రాడికల్ భావాలూ ద్యోతక మౌతాయి.

మనిషి ఒక్కడే అయినప్పుడు, కలం ఒక్కటే అయినప్పుడు ఈ భావ వైవిధ్యం, వైరుధ్యం ఎందుకు వస్తోంది? చుట్టూ కనిపించే పరిస్థితుల వైవిధ్య వైరుధ్య అనుభవాలకు స్పందనే కవితలలో కనబడడానికి కారణ మేమో? కవిత్వం కవికి గొప్ప భావావేశ వెల్లువ కవాటమైనందువల్లనేమో?

కోపం, ఆక్రోశం, నిరసన, నవ సమాజ నిర్మాణ స్వాప్నికత దానికై ఆవేదన, నిరసన, ఆక్రోశం, తపనలెన్నో కవితలలో కనిపించినా నిశితమైన ఉద్విగ్నత కల కవి యన్నది నిర్వివాదము.

ఉద్విగ్నతా పూర్ణభావ నిర్మాణ విన్యాసం, బహు దీర్ఘ సమాస నిర్మాణం, కవి ప్రతిభకు కారణాలైనా కలకాలం లోకుల నోళ్ళలో నిలువ గలవా అన్నదా లోచనాంశం!

గొప్ప విమర్శకుడు నాస్తికుడుగా కవితలలో కన్పించే సుదర్శన్ అందుకు భిన్నం అని చెప్పవచ్చు. ఛాందస భావాలపై ధ్వజమెత్తే సుదర్శన్, సూఫీవాద ప్రభావం కలిగియుండడం గమనింపదగ్గది!

మార్మికత, తాత్వికత సునిశిత హాస్యం, నిర్వేదం, వైమనస్యం, సంచలనం, నిరసన, తిరుగుబాటు, మానవత్వం, అద్వైతంలతో రస ప్లావితమైన ఈ కవితఝ ఇంత కాలం "కొండమల్లి' లాగ, 'అడవి కాచిన వెన్నెల' లాగ అజ్ఞాతంగా ఉండిపోవడం తెలుగు పఠితల దురదృష్టం!

ఈ నాటికైనా దీన్ని వెలుగులోనికి తీసుకురావాలనే గట్టి ప్రయత్నం చేసిన ఆయన అభిమాని, మేనల్లుడు గోపాలకిషన్‌రావు (కవిగారు) చాలా శ్లాఘనీయుడు! ధన్యుడు కూడా! అదనంగా విశేష మేమంటే గోపాలకిషన్ స్వయంగా ప్రతిభా వ్యుత్పత్తులు కల సుకవి, సుమనస్వి.

సుదర్శనం భవిష్యత్తులో కూడా ఉదాత్తమైన కవితలూ గేయాలు వ్రాయాలని నేను మనసారా ఆకాంక్షిస్తున్నాను.

'నేస్తం సుదర్శనం కాలాన్ని ఆపి
నీ కలాన్ని ఝళిపించు,
సమాజం అంతరంగాన్ని ఆవరించిన
తిమిరాన్ని విదిలించు,
నవ్య, భవ్య, భావజాలంతో
కళాకారుల్ని కదిలించు,
వైతాళికుడుగా, యుగకర్తగా
మళ్లీ మళ్లీ జన్మించు!!
ప్రస్తుతానికి సెలవు.

**ఆచార్య జె. వి. రాఘవేంద్రరావు**

సమాజశాస్త్ర శాఖాధిపతి,
ఉస్మానియా విశ్వవిద్యాలయము
హైదరాబాదు.

హైదరాబాదు
13-3-1997

# ఆకాంక్ష

మనిషిలో దైవత్వం
దేవుడిలో మానుషత్వం
కోసం నేనేనాడూ ప్రాకులాడ లేదు.
దేవుళ్ళను నమ్మి మోసపోతే నేను ఆ
బండల్లా పలక్క పడివుండే వాణ్నే,
ధన ధాన్యాది సంపదలు గానీ
ఘన సన్మానాది గౌరవాలు గానీ ఆశించక
మనిషిని మనిషిగా మాత్రమే ప్రేమించిన వాడికి
కనికరపు చూపూ, చిరునవ్వు తునక సైతం
కరువై పోవటమన్నదే
నన్నీమధ్య నమిలి మింగుతూంది,
మనుషుల మాయోపాయాలు చూస్తుంటే
మనిషిలో నాక్కూల నమ్మకం వమ్మైపోదుగదాని భయం వేస్తుంది.
మనిషిని నమ్మజాలని నైచ్యానికి పతనం కాకముందే....
దేవుళ్ళ కేసి తిరిగే దైన్యానికి దిగజారకముందే
ఉన్నట్టుండి ఊపిరాగిపోతే
బాగుండుననిపిస్తూంది.



# తళుకులు

1. చావుని జయించాలన్న
ఆవేశంలో అమృతం తాగేసా
భావనాతీతంగా పని చేసిందది
చావు అజరామరమైపోయింది!

2. 'మిన్ను కురవాలి'
'మన్ను పండాలి' అంటారు
మిన్ను, మన్ను, మిరాశి కాదెవడొక్కడిదీ!
"అన్నం, బట్టా, అందరి హక్కు!"
గట్టిగా అంటే కమ్యూనిజమ్!
పట్టించుకోకుంటే ప్రజాస్వామ్యం!!

3. బ్రద్దలు గొట్టి పారేయకపోదునా!
అద్దం నా అంతర్యాన్ని చూపగలిగివుంటే!!

4. నాయకుల నటనల్తో ఉత్తేజం పొంది
నటులు నాయకులౌతున్నారు

5. ఎన్ని జన్మల ఫలితమో మనిషి జన్మ!
నిన్ను సేవించు నిజమైన భాగ్యమబ్బె!!

6. బాధలధికమైనచో ఈ బ్రతుకు దుర్భర మందురు
బ్రతుకు దుర్భరమైన వేళల బాధలే నన్నాదుకున్నవి
బ్రతుకు దారిన తారసిల్లిన బాధలకు నా ధన్యవాదము!

7. సామాన్యుల కవి జటిలం కౌటిల్యం!
కుటిలులకు మాత్ర మీ ప్రామాణ్యమతి సామాన్యం!!

లౌకిక వాదం !

8. రాజకీయాలోచనే దైతేనేం! మా రాజలోచన
సాహిత్యంలో సార్వ కాలిక సత్యంగా
చెలామణి కాదగిన మాటొకటి చెప్పాడు
"సహనం గాడిద లక్షణ" మన్నాడు
అక్షర లక్ష లక్ష్య భాషణమ్!
వాగ్భూషణమ్ !!
చాలాకాలం ప్రాణి సహజమైన సహనానికి మించి
సహనం వహించిన
సాధు తత్త్వపు ఖరసదృశ జనం సహనం నశించి
చతికిల బడిన్నాడు
చితకబాదే
రజక న్యాయానికి రాజ్యాంగ పారిభాషిక పదమ్!
లౌకిక వాదమ్!!



# చేదు నిజం

నేల, గాలి, నీరు, నిప్పూ
ఏది ఎప్పుడు ఎట్లా పుట్టిందీ
తెలియని అజ్ఞానంలో పుట్టిన భయంలోంచి
భయం పాకి పెంచిన అజ్ఞానంలోంచి
పుట్టుకొచ్చిన దేవుడనే భ్రమ
అజ్ఞాతాన్ని, భయాన్ని
హెచ్చవేయుటే తప్ప
ఇంకేమి ఇవ్వలేనందుకు ఆశ్చర్యపడకు
మతమనే నల్లమందు
నిన్ను మైకంలో ముంచేసిన
గతాన్ని మరిచిపో
మతాన్ని పూడ్చేయ్
నిలిచిన నేలమీద
నేటి పీద
రేపటి సమతా సౌధానికి గట్టి పునాదులు వెయ్!



# అవమాయకుడి ఆరాటం

రాజకీయాలు తెలియనివాడ్ని వార్థి
వాజాయె క్రింద జమకట్టే ఈ
రోజుల్లో, లోకుల్తో పలుగాకుల
ఫోజుల్తో
రాజీ కుదరక యీ మధ్య మరీ
బేజారై పోతున్నాను స్వామీ, నేను!
రాతి దేవుళ్ళంతా
ప్రాతవడి, పచ్చి
బూతులకు లోనై, మరపనే
గోతుల్లో దిగబడి
పాతరబడి పోయారు పాపం!
క్రొత్త దేవుళ్ళ
ఒత్తిడికి ఓర్చుకోలేక!!
అపరాధం ప్రభూ!
అయినా అనక తప్పదు
నీకా వినక తప్పదు
రొట్టెముక్కకీ నాటి నీ ప్రపంచంలో
రెట్టింపు విలువున్నది నీకన్న!
చుట్టానివి కాకున్నామానే! మా
పొట్టకన్నెక్కువా నువ్వు?
వ్యక్తి మనుగడకి
శక్తి కావాలి

శక్తి కావాలంటే శరీరంలో
రక్తం వుండాలి
రక్తం కోసం
భుక్తి అవసరం.... అయినప్పుడు
భుక్తికోసం
రక్తమైనా చిందిస్తాం
ఇదీ మా మతం
నేటి కర్మ సిద్ధాంత స్వగతం!
ఇదంతా చూచి
తూచి
చివరకు
నీవూ నేననే
తారతమ్యాల్నుంచి కాస్త
తీరిక జేసుకుని
రావాలనిపిస్తుంది
నీతో ఏకం
కావాలనిపిస్తుంది!
అయితే........
అడుగడుగున
ఒడిదుడుకులున్న యీ మార్గంలో
పడిపోతానో అని భయం వేస్తుంది!
పగలూ రాతిరనక యీ
జగమంతా వెదుకుతుంటాను
అగుపడన్నీకోసం ఈ
తగని ప్రేమ యెందుకో?

ఈ గవేషణెంత వరకో?

ఇంతకూ—

మా పోతన్నన్నట్లు

ఉన్నావో లేనే లేవో ?

నన్ను మాత్రం వెఱ్ఱిలో ముంచెత్తుతోంది

కన్నుగానని నా సమ్మకం........

నిన్ను గురించి !

కూలి వాని

పొలం నుంచి

జాలువారే చెమ్మటలో చూడమన్నాడు

నిన్ను - మా టాగోర్ - మా గురుదేవుడు

గురు దేవుడికి

ఒరవడి పెట్టటం నా మతమని

పొరపడకండి !

కాని..........

నిజం చెబుతున్నాను ప్రభూ !

నా కందులో

ఏమిల్లోనరు మేడనో, ఏ

జమీందారు పీడనో తప్ప

నీ నీడైనా

కనపడింది గాదు !

కారణ మంటావా ? చెబుతా....విను

కరుణామయుడివి

నీ వలాంటి

నరకంలో

పీడనాదక్షుల నిర్మిత ఘర్మ
నరకంలో
కలవను కోలేను
ప్రత్యక్షం కా
గలవనుకోలేను, నేను !!
ప్రభూ
నిజం లో
మజా లేదు :-
లేదని కాదు,
ఉంది .... కాని చేదు !!
అయినా
నిజమే చెబుతా
అటుపైన వాళ్ళిష్టం
అదృష్టం !!



# అవినీతి పాలైనప్పుడు

తలచుకుంటే తల దిరిగిపోతున్నది!
అత్యున్నత శిఖరం నుంచి అగాధంలో
పడి కూడా బ్రతికున్నానన్నది
భ్రమా? నిజమా?
పోల్చుకోలేక పోతున్నాను!!
ధన దాహమే వుంటే
ఘనంగా ఆర్జించగల కాలం
ఈ జీవితంలో ఇరవైయేళ్ల నాడు
నాలుగు నెలలపాటు నన్ను వరించింది

అయితే
అది వరకే నా ఆర్జిత
సంస్కార ధనం ముందు చచ్చు కరెన్సీ ధనం
తన విలువని స్థాపించుకోలేక పోయింది!
వెన్నలోంచి తీసిన వెంట్రుకలా
నన్ను నేను కాపాడుకొని బైటపడ్డానప్పుడు!!
ప్రతి పైసకీ బాధపడ్డ సందర్భాల్లేకపోలే దప్పట్లోనూ
అయినా యెంత హాయిగా, యెంత ఆనందంగా గడిపాను
నీరు పల్లానికే ప్రవహిస్తుందన్న
సామెత సార్థకం కాగా
ఇప్పుడీ అగాధంలోకి ఎక్కడెకడ్నుంచో
వచ్చి పడుతున్న ధన ప్రవాహం నన్ను
గొంతు వరకు ముంచేసింది

మెట్టుమీదవుండి అలలు లెక్కించటమే తప్ప
నీటిలో ఈద నేర్వని నేను
ఏ క్షణాన ఈ ప్రవాహం
తలకు మించినదై తనలో తాను చేకుసుని
నా సర్వస్వాన్ని నాశనం చేస్తుందోనని
అనుక్షణం భయాందోళనల్తో
బ్రతుకలేక చస్తున్నాను
అమ్మా! ఆపు ఈ ప్రవాహాన్ని
నీ ఆన! నీ ఆసరా గొని
పైకి వచ్చేస్తాను ఈ ఆగడం నుంచి.
బ్రతికినా చచ్చినా ప్రశాంతతకి
భంగం వాటిల్లదదే చాలు!



# అహమ్ భావమ్ !

జననీ స్తన్య బలా విర్భూత నిశ్వాసోచ్ఛ్వాస నినదిత
హంసానాదస్థ అస్తిత్వ భావనా క్షణ భంగుర మిద మహమ్ !
సత్వ, రజ స్తమ త్రిగుణాత్మక
పాంచ భౌతిక సత్య మహమ్ !
క్షణ క్షణ మరణ భయ పీడిత
అనుక్షణ అనిత్య మహమ్ !
సకలార్ధ సాధనోపకరణ మహమ్ !
సర్వానర్ధ మూలకారణ మహమ్ !
ఆది, మధ్య అంతమహమ్ !
ఆది, మధ్యాంత రహిత మహమ్ !
నేను ఉన్నంత వరకే నువ్వూ, వాడూ, అదీ, ఇవీ
ఈ సకల చరా చర జగత్తూనూ !
నేను లేని నాడు నువ్వూ లేవు, వాడు లేడు, అదిలేదు, ఇదీలేదు
ఈ దృశ్యా దృశ్య లోకాలేవీ లేవు !
ఇత్యహమ్ !



# ఏడుకొండలవాడికి విన్నపమ్!

నాస్తికుని విజ్ఞానంలో
ఆస్తికుని అజ్ఞానంలో
దరిద్రుని సంతానంలా
సిరిగలవాని పిసినారితనంలా
పెరిగిపోతున్ననీ పేరూ ప్రతిష్ఠలు
ఏ మంత్రి ఈర్ష్యాసూయలు వెంటాడినయో
అమాంతం అగాధంలో పడిపోయినవై !
యూదుల్తో యుద్ధంలో
బూడిదైపోయిన నాసర్ పలుకుబడిలా........
పందొమ్మిదిమంది భక్తులు—
అజీత్ సింగ్ హయాంలో
విజయవాడ వీధుల్లో
పందుల్లా
వియత్నాం వీధుల్లో పసి
గందుల్లా
ప్రాణాలు విడుస్తూంటే నీ
బందోబస్తు భటులల్లే నువ్వూ
"ఎందుకు మనకా వెధవ గొడవ" వనుకున్నావా ?
విందుల్తో, వింజామర ఆరామ్‌లో
విరామం చిక్కలేదా ?
నిజంగానే 'బండ' వని నిరూపించుకున్నావా ?
ఏడుకొండలవాడా ! వెంకటరమణా ! !

ఏడున్నావురా ? గోవిందా ! గోవిందా ! !

ఎన్నాళ్ళ నుంచో వింటూన్న ఈ మాటలకి

ఇన్నాళ్ళకి, ఇన్నేళ్ళకి, ఈ నాదికి

సరైన అర్థం

స్ఫురింపజేశావా స్వామి !

సీ

ప్రచారకుల యుక్తి గోవిందా !

పాలకుల మారేడుకాయ శక్తి గోవిందా ! !

ఉత్సవాల ఊరేగింపుల యుక్తి గోవిందా !!!

బండ భక్తుల భక్తి గోవిందా !!!!

పూజారుల భుక్తి గోవిందా !!!!!

ముముక్షువుల ముక్తి గోవిందా !!!!!!

గోవిందా ! గోవిందా !!

(తిరుమలేశుని సన్నిధిలో తొక్కిసలాటలో పందొమ్మిదిమంది భక్తులు ప్రాణాలు విడిచారన్న వార్త 21-9-1967 నాటి దినపత్రికలో చదివి :)



నాకేం వున్నాయి" ?
'జరరుజ, అన్నదే
సరసమైన సత్యం ?'
అని అక్కడే వున్న దిండు ని
ఆనుకుని "అమ్మా" అంటూ
సేను వాల్చాడు
ఇంత రాత్రిలో ఒంటరిగా వొచ్చావ్
వింతలూ విశేషాలేమైనా వున్నాయా?" నాకు,
అంత్య కాలామాసన్న మౌతుందన్నదే పెద్ద
వింత విశేషము సర్వమూను
అని—
అదో విధంగా, వెకిలిగా నవ్వాడు
గొంతు కూడా కూలబడి పోయిందప్పటికే
చెంతనున్న నాకే వినిపించేంత విస్పష్టంగా లేదు
అయినా ఆగక ఆవేదనాభరంగా చెప్పుకు పోతున్నాడు :
"ఎంత వేధిస్తున్నారీ మధ్య
అంతా అబద్ధమట్రో . . . అభూతకల్పనంటే వింటేగా
వేల ఏళ్ళ క్రిందట
పాలక వర్గాల వారు పరి
పాలనా వ్యవహారాల్లో 'వీడూ వాడనకుండా
అందరూ -
కలుగ జేసుకోటాన్ని సహించలేక
స్వలాభావేశంలో మానవ సమాజంలో
చీలికలు తెచ్చి
తలకో పని తగిలించి

కులాల కుళ్ళు సృష్టిస్తే
"దొరను దొబ్బ లేక తొత్తును దొబ్బు" నన్న ధోరణిలో
సంఖ్యా బలం లేని మేధావుల్ని! దానికి
బాధ్యుల్ని జేసి
వేధిస్తున్న వెఱ్ఱి వెంగళాయిలు
"అనాధుడికీ ఆగర్భ
శ్రీ నాధుడికీ మధ్య
అనాదిగా సాగు" తూన్న
అనంత సంగ్రా"మానికి
నేనే బాధ్యుణ్ణని
నానా బాధలు పెడ్తున్నారు
ఎన్ని అవతారాలెత్తినా
నేనూ మీలా
యోని జుణ్నే
(మనుజు ణ్నే! మర్త్యుడిగా పుట్టి గిట్టిన వాణ్నే, ఇంకా నిజం
చెప్పాలంటే) మీ
అనుజుణ్ణె (మీ కన్న
వెనుక
జనించిన వాణ్నే) మీ అందరి
అనుగ్రహం వల్లనే
మనగలుగు తున్నానంటే
వినిపించుకోరీ వివేక శూన్యులు!
ఎవడో యెప్పుడో అన్నాట్ట ఈ
సకల చరాచర జగత్తుని

దేవుడనే వాడేవడో సృష్టించాడని :
అది
మొదలు
వెదకులాటలు
వాదులాటలు
మొదలైనవై
వాడి ఉనికిని గుణించి
వాడి పని తనాన్ని గుణించీ
ఊక దంపుడు మాటల్తో, ఊహాగానాల్తో
లోకాన్ని మభ్య పెట్టారు లుబ్ధులు :
(విప్రలబ్ధులు)
నిజానికి . . . .
అదిలో — అంటే
ఇదేది లేసప్పటి మాట
అణువు నుండి అజాండం వరకు అన్నీ ఆమె
శోణితంలో శుక్తిలో మౌక్తికం లా దాగి వుండేవిట :
వున్నట్టుండి ఓ సుముహూర్తాన
మన లోకంలోని
మనుష్యాది సమస్త జీవుల యీ లోకంలోని
ఆడాళ్ళందరికి మల్లే ఆమెకి
కూడా
తన శోణితంలో దాగి వుండి
తనకి కనపడకుండా వున్న
ఆ ఆణి ముత్యాల్ని
ఆ అణువుల్ని, అజాండాన్ని

చూడాలన్న
వేడుక వేగిర పెట్టటంతో
జాగృతమైన
అమృతం లాంటి
ఆ మాతృత్వకాంక్ష
అంతకంతకూ అధికమైనా
ప్రబుద్ధమై ప్రచేతనమై
విలక్షణమై విలక్షణ లక్షితమై
విశదమై, విశుద్ధమై, శుద్ధ, స్వచ్ఛ శుక్లమై
శోణితాన్ని శోధించి
శుక్తిని ఛేదించి
మౌక్తికానికి ముక్తిని ప్రసాదించడంతో
ఇష్టరచన, ఈ సృష్టిరచన మొదలైందట
ఇదంతా యిలా చెబుతూంటే
వేదాంతమని వెక్కిరిస్తారు, విసుక్కుంటారు :
వేదాంతం కాదూ వెలక్కాయ కాదు !!
మధనపడి
మేధస్సులు
శోధించి
సాధించిన శాస్త్రీయమైన సత్యం ఇది
ఈ నిజం
యే నిజం కాదు !!
నీవై రాయిలో నీ రూపాన్నే చెక్కుకుని
దేవుడని చెప్పుకుని, నిన్ను
నీవే వంచన చేసుకుని, నీడల్లో మేడల్లో

దేవుడిలా, దేబెలా
వాడెవడో యెక్కడో
ఉన్నాడని ఒకడంటే పెద్ద
సున్నా చుట్టి లేడని వేరొకడు
(ఇలా వున్నాడనే వాడాస్తికుడనీ
సున్నా చుస్తే వాడు నాస్తికుడనీ
ఆస్తికుడు చూపించ లేడనీ
నాస్తికుడు నిరూపించ లేడనీ)
అస్తి
నాస్తుల
కుస్తీ పట్లలో పడి నలిగి
చస్తున్నదంతా మీ
చాదస్తం :
ఒక గమ్మత్తుంది చూశారా ?
ఆస్తికులూ, నాస్తికులూ
ఈ ఉభయులు ఉన్నారు ;
ఉన్నవాళ్ళుభయులూ అమ్మ
కన్నవాళ్ళే !
అయ్య లేకుండా పుట్టారనబడే వాళ్ళనేకులు అన్ని
మతాల్లో కనబడతారు !
కాని
అయోనిజులనబడే వాళ్ళు సైతం అమ్మ శరీరంలోని
యే యితర
అవయవ జన్యులో మాత్రమే తప్ప
ఆమె లేకుండా పుట్టిన వారు
యే మతంలోనూ కానరారు !?
అమ్మ అందరికీ

సమ్మతమైన సత్యమే.
ఇక
నేనా !
నేనేమి కాను !
కానంటే వినక నా వెంట బడ్డారు
కక్ష బూని కత్తి గట్టారు నామీద
రక్షణ లేదురా బాబూ
యే క్షణాన్నాయినా ఇహ యాత్ర ముగుసి
పోవచ్చని నా
వీలునామా వ్రాయండి
సీలు చేసి పెట్టా
నా మరణా నంతరం
నీ మారీఫత్తుకి
అది మార్చబడేందుకు
అవసరమైన యేర్పాట్లన్ని చేశా
తీసుకుని రా
పెద్దకర్మ సందర్భంగా
పెద్దల సమీక్షంలో
సీలు చించి
వీలు వినిపించి, అక్షరాలా తామీలు
చేయించు !
టాటా; బైబై అంటూ
బైటపడ్డాడా రాత్రి !
అటు తర్వాత అగుపళ్ళేదు మళ్ళీ
హఠాత్తుగా అందిందీ వార్త మూణ్ణాళ్ళ క్రితం
చచ్చిపోడు చాలాకాలంగా
చచ్చేంత ప్రచారముకోన్నేడు
అచ్చు పిలుపులందుకే వేయించలేదు !
వచ్చే వారందరికీ యిదే ఆహ్వానమ్ !!

# విలయ విన్యాసం

మరో మారుపిచ్చెత్తి
మూర్‌ని ముద్దెట్టుకున్నాను
రాఘ్‌ని జీర్ణం చేసుకున్నాను.
సూర్యున్నీ చుక్కల్నీ దాటి
పాలపుంతపైకెగసి
వెలుగు చీకటుల మధ్యగల
చిలిపి గీతల్ని చెరిపి వేశాను.
కైవారాల ఖైదు నుంచి కాలాన్ని విడిపించాను
దిక్కుమాలిన సృష్టికి దిగ్ధానం చేసాను.
గోడల్లో గుండెని బంధించలేక
గూడొదిలి, గుడ్డలు విడిచి పారేసి
నగ్నంగా నాలుగు బజార్లు కలియదిరిగాను
నన్ను జూచి నవ్విన వాళ్ళ బట్టలూడదీసి
బజార్లంట తరుముకెళ్లాను.
తలద్రిప్పక వెళిపోయే దౌర్భాగ్యుల్ని పనిగట్టుక పట్టుకొచ్చి
పంట్లామ్ బటన్లు విప్పి
నీతినియమాల నిజస్వరూపాన్ని చూపాను.
సాగిపోతూన్న జనసందోహాల్ని
ఆగుమని చెప్పే ప్రమాద సూచికల్ని
అమాంతం తొలగించేవేశాను.
'రైట్ సైడ్'ని 'రాంగ్ సైడ్' అనే
అరాజక ప్రభుత్వ ప్రతినిధిగా ట్రాఫిక్ దీపాన్నాక్రమించిన
జనాన్ని

దింపేసి, తీవిగా ఎడం చేయి వేపుగా
వస్తూన్న మంత్రి గాడ్ని
రెక్కుచ్చుకొక్కుర్నుంచి లాగి
మరెప్పుడూ 'ఎడమని' రైట్ అనపుగడాని
లెంపకాయలేసి పంపేసాను.
సతీత్వంమ్మీద సానివాడల్లో పరిశోధనలు జరిపాను
దొంగ నటనల్తో
కొంగ జపాల్తో, కోరికల్తో దోబూచులాడుతూ
బ్రతుకంతా ఆత్మవంచనకే బలి అయి
అనలేక
మనలేక
కుమిలి కృశించే కులాంగనల్లా గాక
ఎలాంటి దాపరికాల్లేకుండా
బ్రతికే పడుపుకత్తెల స్ఫటిక నిర్మల ప్రవర్తనలో
అందాన్నీ
ఆనందాన్నీ
అరమరికల్లేకుండా బరికిపెడుతూ కొరుక్కుతిన్నాను
తన తనువు సర్పించి
మన అక్కాచెల్లెళ్ళ, ఆలూ అమ్మల
మాన మర్యాదల్ని పోషిస్తూన్న మమకారానికి
మారు రూపమైన
వారకాంత ననుభవిస్తూండగా
'పదిమంది నడిచే బాటలో పచ్చగడ్డి మొలవ'దన్న
సామెతకి సవాల్‌గా
దాని స్తనాల్నుంచి

జాలువారిన
పాలధార
పతితలో 'అమ్మ'ను చూపింది
చిన్ననాడు నన్ను బుజ్జగించి నిదుర బుచ్చామనుకొని
సొన్న నగలు ఏసహా, నగ్నంగా వున్న అమ్మతో
ఆడిన ఆటల్లోని ఆంతర్యం నెమరుకి వచ్చి
'అమ్మ' లోనూ 'వెలయాలి'ని చూపింది!
అమ్మ, ఆలూ, వెలయాలు........
ఎవరయితేనేం! అంతా వెలకి బలిన్నైనవారే!!
'కుల్లు గుత్తా బేర' మొకటైతే రోజు కూలి బేర' మొకటి!
వెలయాలి విలువలు కొలబద్ధగా
శీలానికి వెలగట్టి వెలివేసాను.
రథ, గజ, తురగ, రాధా మాధవ లీలాది రాజమార్గాల్నుంచి
కాలి బాటలకి మళ్ళిన కళా గారడి
కూటికోసం, గూటికోసం, గుడ్డకోసం
పాట్లు పడే కోట్ల జనాన్ని
కనకట్టు చేసి
తన పొట్ట పోసుకునేందుకుపయోగపడ్డమే తప్ప
పేదలకి సాధించి పెట్టింది లేకపోగా
ఆకలినావిష్కరించి, అవమాన పరచే
దైన్యాన్ని నేర్పిన దానవతగా రుజువు కాగా
దానికి దహన సంస్కారం జరిపి
మంత్ర ముగ్ధులైన అమాయకులకి
మత్తొదిలించి, మానవతా ప్రబోధం చేసాను!
రాజకీయ రక్తవమానాల్లో తడిసి రంగులు మార్చుకున్న
కాగితప్పువ్వుల్ని, కంపుకొడ్తున్న నవ్వుల్ని

ప్రకృతి శోభావాహినుల్తో ప్రక్షాళనం చేసాను!
వెలుగుని వెదికే వెట్టిలో

చీకట్లో చిక్కి
కేకలేస్తున్న
శోక మూర్తులకి
వెలుగు రాకని తెలిపిన వేగు చుక్కని నేనే!

చెట్ల గుబురుల్లోంచి
కొండ కోనల్లోంచి
పాతాళపు లోతుల్లోంచి
పలవరిస్తూన్న పిటకి పందల్ని బైటికి లాగి
పురవీధుల్లో జడవకుండా నిలిచిపోరాడ్డం నేర్పిందినేనే!!

నగరాన్ని తగలెట్టి అనాస్తకంగా
నవ్వుతూ నిల్చున్న సంగినాచుల్ని
జనపదాల్లోకీడ్చి, విజయశంఖం పూరించే ధైర్యంగరపింది
నేనే!!!

సినిమాలు, రైలుస్టేషన్ల, క్యూల్లోకి స్త్రీలన్నెట్టి టికెట్లు
సంపాదించి
పరువుగా గమ్యం కేసి పరుగుదీసే
పురుష కిటకాలకి ఉరి తాళ్లు బహూకరించాను.

బస్సుల్లో, రైలు బండ్లలో, కడుపుతో వున్న కాంతనే,
కాంతతో వున్న పాపనీ, చూపి, కాస్త చోటు చేసుకూర్చుని
చోటిచ్చిన వాళ్ళనే సర్దుకూర్చొమ్మని మందలించే
మగమగువలకి 'మేల్ మాయిల్' అడ్రస్ వ్రాసిచ్చాను!
దేవుళ్ళకి మొక్కి, దేశాన్ని దోచుకుతినే దానవుల్ని
వేషాలు మార్చి

దోషాలు కప్పివేసుకోజూచే దొంగలంజాకొడుకుల్ని
పైరవీల్జేసి, ప్రజా ధనం కాజేసి
భవనాల్లో కులికే భడవాల్ని
నల్లబజార్ నలుల్నీ
తెల్లని దుస్తుల నల్లదొరల్నీ
కనిపించి, అవకాశం చిక్కినప్పుడల్లా కాల్చి వేసాను !
సంప్రదాయాన్ని చంపేస్తాననీ
అన్యాయాన్ని అంతమొందిస్తానని
ఆదర్శ మానవ సమాజాన్ని నిర్మిస్తాననీ
అహోరాత్రాలు
నిద్రాహారాల్తో నిమిత్తం లేకుండా
నిత్య విధిగా, జీవిత పరమావధిగా నడచి
ప్రతిక్షణం బ్రదుక్కి భావనకీ భేదం లేకుండా
బడలి, కూలబడ్డాను.
అయినా అపజయాన్నంగీకరించే అధీరుణ్నీ మాత్రం కానా !
అజేయుణ్నై
అన్ని వేపులా అతిజాగరూకుణ్నై కనిపెడుతున్నాను—
నమ్మకోసం నకల బాధల కోర్చి
సమాయత్త పరచిన జనం వేలం వెఱ్ఱిగా
సమ్మక్క, కోటప్పకొండ జాతరాలకి సాగిపోతూంటే చూచి
కలరా వ్యాధి కబళించి వేస్తూంటే
పొలిమేరమ్మకి మ్రొక్కుకునే మూర్ఖత్వాన్ని జూచి
విషూచికి వేక్సిన్లొద్దని
పోచమ్మకి 'బోనాలు' పెట్టే దిక్కుమాలిన దైన్యాన్ని జూచి
గొఱ్ఱెకూరకూటికీ

పావలా కల్లుకీ, పావెడంత సారకీ,
పతాలమత్తుకీ
కులాల కుళ్లు గుంజాటనకి లొంగి
గొట్టెపాటుడుగా, కోటేవాణ్నే కోరుకునే ధోరణిలో
కోట్ల సంఖ్యల్లో
తూట్లపెట్టెల్లో
చీట్లు పడేసి చీకూచింత లేకుండా వెళ్లే
అన్నల్నీ, తమ్ముళ్లనీ, అక్కల్నీ, చెల్లెళ్లనీ,
అమ్మల్నీ, అయ్యల్నీ,
ఆవేదనతో, ఆవేశంతో, అలమదించి, నేసు
అరచిన అరుపుల్నీ,
వ్రాసిన వ్రాతల్నీ
పాలకుల బండ చెవుడు....
మొండిమేధస్సు
లండు మనస్సు....పట్టించుకోక
వినే ఓపికున్నా జాతి జనులకి
ఉచితానుచిత విచక్షణా జ్ఞానంలేక
అరణ్యరోదనై వికటాట్టహాసం చేస్తూంటే
పిచ్చినావేపు బైల్దేరి వస్తూండగానే గాంచిన
సమాజ స్వరూప మహాస్వప్నం తాలూకు సౌందర్యం
నగ్నంగా కళ్ళముందు నర్తించగా
మగతనం

మాగబోతూంది! ఆకలి

పగగొంటూంది! !

ఉద్యమం ఊపిరి సలుపనీయక

ఉదర పోషణకి వేరే ఉద్యోగం లేక

పస్తులుంటున్నాను! క్రమక్రమంగా

చస్తున్నాను!!

అందుకే అంటున్నాను!!!

పూటకు బుక్కెడు కూటి యేర్పాటు చేసుకోకండా

కవులుగా, కళాకారులుగా

గలలుగనీ కలవరించి

పలవరించకండని!

అవిద్యనీ, అజ్ఞానాన్నీ

అంతమొందించ దీక్షగొనండని!!

అధ్యాపకులై

ఉద్యమం నడపండని!!!

★

# దేని మీద

నీ నోరు కట్టేసిన కర్మ సిద్ధాంతంతో
ధర్మసూత్రాల మీద
సంపదకు సరియైన అర్థం తెలియని
దోపిడిగాళ్ళ చేతుల్లో రూపొందిన
శాసనాలమీద
రెక్కల కష్టానికి
బుక్కెడు బువ్వ సైతం అందనివ్వని
వ్యవస్థీకృత దుర్వ్యవస్థ మీద (ఆర్థిక వ్యవస్థమీద)
అందీ అందని అధికారపు ద్రాక్షలు జూపి
అశ్రిత బంధుజన పక్షపాతపు అజ్ఞానాన్నీ
కులమత తత్వాల కుళ్ళునీ
ఊరూరా, వాడవాడలా
పంచుతున్న ప్రజాస్వామ్యం మీద
మనిషి కాయ కష్టం సృష్టించే సంపదకు
మారకపు విలువలు కల్పించి
మానవత్వపు విలువల్నే తారుమారు చేసిన
కేపిటలిస్టు కరెన్సీ విధానం మీద
కమ్యూనిజంలోని నిజాన్ని జూచి గాభరాపడి
అబద్ధాన్ని ఆయుధ బలంతో

మాగబోతూంది ! ఆకలి
పగగొంటూంది! !
ఉద్యమం ఊపిరి సలుపనీయక
ఉదర పోషణకి వేరే ఉద్యోగం లేక
పస్తులుంటున్నాను ! క్రమక్రమంగా
చస్తున్నాను !!
అందుకే అంటున్నాను !!!
పూటకు బుక్కెడు కూటి ఏర్పాటు చేసుకోకండా
కవులుగా, కళాకారులుగా
గలలుగనీ కలవరించి
పలవరించకండని !
అవిద్యనీ, అజ్ఞానాన్నీ
అంతమొందించ దీక్షగొనండని !!
అధ్యాపకులై
ఉద్యమం నడపండని !!!

★

# దేని మీద

నీ నోరు కట్టేసిన కర్మ సిద్ధాంతంతో
ధర్మసూత్రాల మీద
సంపదకు సరియైన అర్థం తెలియని
దోపిడిగాళ్ళ చేతుల్లో రూపొందిన
శాసనాలమీద
రెక్కల కష్టానికి
బుక్కెడు బువ్వ సైతం అందనివ్వని
వ్యవస్థీకృత దుర్వ్యవస్థ మీద (ఆర్థిక వ్యవస్థమీద)
అందీ అందని అధికారపు ద్రాక్షలు జూపి
ఆశ్రిత బంధుజన పక్షపాతపు అజ్ఞానాన్నీ
కులమత తత్వాల కుళ్ళునీ
ఊరూరా, వాడవాడలా
పంచుతున్న ప్రజాస్వామ్యం మీద
మనిషి కాయ కష్టం సృష్టించే సంపదకు
మారకపు విలువలు కల్పించి
మానవత్వపు విలువల్నే తారుమారు చేసిన
కేపిటలిస్టు కరెన్సీ విధానం మీద
కమ్యూనిజంలోని నిజాన్ని జూచి గాభరాపడి
అబద్ధాన్ని ఆయుధ బలంతో

తరతరాల దాస్య జనిత దారిద్ర్యపు చలిని
ఇరవై యేళ్ళ ఇంటోడి పాలన పైర ఇనుమండించింది
కమ్మని కవితల సెగళ్ళతో వదలదీ చలి
అందుకే
చేవ చావని ఆశయ జీవివైతే........
రమ్మంటున్నా కలం గిరాటేసి ! రైఫిల్ లోడ్ చేసి !!
చుట్టూ చూచి
చుట్టా పక్కాల్ని జూచి
నిట్టూర్చకు !
తాతలూ తండ్రులూ దాయాదుల
రక్తపు చిక్కదనమూ, రంగూ, నీ
శక్తిని శంకించి నిన్ను
కృంగ దీస్తే....
కృష్ణుని పాత్రలో వ్యాసుడు పలికించిన
యుద్ధనీతి నోసారి నెమరేసుకో !
అవ్యవస్థని గురించి ఆక్రోశించటం గాక
అంతమొందించటమే ఆశయమైతే
కావ్యాల కాల్పానిక లోకాల్నించి కార్యరంగంలోకి రా !
అలాకాక కవితారాధనే ధ్యేయమంటావా !
సలక్షణంగా ఛందోబద్ధమైన చక్కని కవితలు వ్రాయి !



# పుట్టబోయే ప్రాణి ప్రార్థన

మీ లోకంలో
భూలోకంలో
పుట్టాలంటేనే
పుట్టెడు సందేహాలు
పుట్టుకొస్తే
పుట్టబోయే ముందు
పట్టుమని పది మాటలు
ప్రార్థనా పూర్వకంగా పలుకాలని ఉంది
వ్యర్థరోదన కానివ్వండి
గబ్బిలాల్ని, గద్దల్ని
గుబ్బిళిగాళ్ళనీ, గూబల్ని
తోడేళ్ళనీ, తోచిగాళ్ళనీ,
కోడె త్రాచుల్ని, కొండ చిలువల్ని
భూత పిల్లుల్ని, బూచీగాళ్ళనీ
ఈతి, ఎద్దడి, ఈర్ష్యాసూయల్ని
మూషికాల్నీ, ముష్కరుల్నీ
విషూచి, పిశాచీత్యాది వ్యాధుల్నీ, బాధల్నే
నా
దరి
జేరనీకండి
పుట్టొచ్చు నేనే ముహూర్తనైనా
గుట్టంత భయ భారం కుంగదీస్తోందిప్పుడే!

జాతిభేదాల
లోతైన
గోతుల్లో నన్ను
మతాల
మత్తులో ముం
చెత్తుతారనీ,
అతి లౌకికమైన అసత్యాల్తో నా
గతినే అపమార్గం పట్టిస్తారనీ
అతలాకుతలపు
వెతల్తో నన్ను
సతమతం చేస్తారనీ;
మీరణ
ధోరణికీ
తీరని
దారుణ దాహానికీ,
అరని మానవ
మారణ హోమానికీ
నన్నాహుతి చేస్తా
రన్న
నా భయాన్ని
'అభావం చేస్తామ' ని
అభయ హస్తం చాచే
ధైర్య ముందా మీలో ?
పుట్టబోయే మీ గారాబు
పట్టి కొసం - నా కోసం

జలాశయాలు నిర్మించండి!
పొలాలు దున్ని పుష్కలంగా పండించండి!!
జోలపాడి బజ్జోబెట్టే పక్కలూ, చంద్రుడూ,
ఓలల ఊయెలలూచే సెలయేళ్ళూ, జలనిధులూ
ఫల పుష్పాల్తో నను పలుకరించే వృక్ష సంతతులూ
గాలికి గానం నేర్పే పక్షి సంతతులూ, నాకు
సహచరులుగా సమకూర్చండి!
నాదారికి ఆయనం తానై
పాదాలకి ప్రాణం తానై
జ్ఞేయం తానై, జ్ఞానం తానై
ధ్యేయం తానై, ధ్యానం తానై
గమ్యం తానై, గమనం తానై
అడుగడుగున నను
నడిపించే
నాలోలో
వెలుగుల నించే
సుజ్ఞానపు సుందర రూపం
విజ్ఞానపు విద్యుద్దీపం
ఇవ్వండి! వెలిగివ్వండి!
అన్నెం పున్నెం యెఱుగని అమాయకుణ్ణి
నన్నెలా స్వీకరిస్తారో నాకేమి తెలియదు!
నా కాయంలో
లోకం ఆరోపించే
పాపాలకీ
కోపతాపాలకీ

సాక్ష్యనిపించేది
నా కనుసన్నల కతీతమైన
అరిషడ్వర్గం
పురికొల్పి నాచే
ఒరిపిడించే
దురితాలకీ, ద్రోహాలకీ
నా
వాక్కులు బట్వాడా చేసే
నే కోరని, ఉద్దేశించని, అర్థాలకీ, అనర్థాలకీ,
నా
చేతుల్లో
చితికిపోయే జీవితాల
చెఱగని చిత్తరువులూ,
హతులైన వారి ఆప్తుల ఆర్తనాదాలూ
నా కళ్ళకి కట్టిన్నాడు
నా గుండెల్ని పీక్కుతిన్ననాడు
నా ఎదని వేదించిన్నాడు
నా పట్టాన నన్ను బ్రదకనీక
ఉక్కిరి బిక్కిరి చేసిన్నాడు
నేననుభవించే యమ యాతనికి
నన్ను క్షమించండి
మన్నించి మననీండి
వృద్ధులుపదేశిస్తే
అధికార మదోన్మత్తులాదేశిస్తే, శాసిస్తే
పర్వతాలు ప్రకోపిస్తే

ప్రేమికులు ప్రేరేపిస్తే

పరివారాలు పరిహరిస్తే

పరిసరాలు పరిహసిస్తే

కదలి అలలు నను కవ్వించేస్తే,

ఎడారి తనలో యిమిడ్చి వేస్తే

చిల్లి గవ్వ చేయని బిచ్చగాడు నా చిల్లరని విసిరికొడ్తే

పిల్లలూ, పెళ్ళామూ, విసుక్కుంటే, కసిరికొడ్తే

ఎవరెవరితో, యే యే భంగుల యే యే సందర్భాల్లో

ప్రవర్తించాలో, నేనేయే పాత్రల నభినయించాలో

ఓర్పుగా మీరే నాకు
నేర్పండి ;
పురిటి కేక కన్న పూర్వమే ఇలా
అరుస్తున్నానేంటని అనాదరణగా వినకపోయేరు !!
రక్తదాహంతో రంకెలు వేసే రాకాసి మూకల్ని గానీ
భక్తి పారవశ్యంలో భగవంతుణ్ణనుకునే
"అహంబ్రహ్మాస్మి" గాళ్ళని గాని
నా
దరి జేరనీకండి,
నా
మానవతనీ, మంచి తనాన్నీ
జ్ఞానాన్నీ, విజ్ఞానాన్నీ
న్యూన పరచి
నన్నో
ప్రాణాంతకమైన భారీ యంత్రంలో
ప్రాణహీనమైన జడ భాగంలా
ఒకే
ఒక
కోణంలో

కుంచె
చిత్రించిన బొమ్మలా
నా ముఖానికొక
వెల తగిలించి
వ్రేలాడదేసి
వేలం వేసి
నా
సాకల్యాన్ని
వికలం చేసి
సన్నో
దారిన తగిలిన
గులక రాయిలా
ముళ్ళ మండలా
నీళ్ళ మడుగులా
ఇటూ అటూ
ముందుకు వెనుకకు తంతూ
చిందుతూ
ఆనందించే
అధికుల మనుకునే అధముల్ని
వెధవల్ని, యెదిరించే
మదమణచే
శక్తి ప్రసాదించండి !
"జయోస్తు"ని ఆశీర్వదించండి !!
ప్రతీప శక్తుల ప్రతి కదలికనీ
ప్రతిఘటిస్తూ అప్రతిహతంగా
పురోగమించనీండి.
లేదా
వన్నిలాగే చావనీండి !!



# నిర్మకుట చక్రవర్తి నిర్వేదము

నాకేలనో ఈ రాతిరి
రాకున్నది నిదుర అసలె !
ఊరు సద్దుమణగె కాన
రారు ఎవరు బైటనెచట :
వింతగొలుప వినిపించెడు
గొంతులేవొ ఈ ప్రొద్దున
గుండెలదిమి పట్టుకొనిన
కొండబ్రద్దలైనయట్లు
చండఘోషలేవేవో
నిండు వీనులందునేడు !
నేను కోరలేదు పదవి
నేను కోరనైతి యశము
నన్నేలాకొ ఎన్నుకొనియె
మిన్నంటెడు ఈ కీరితి !
మూకవాళి మనుచుకాంక్ష
లూని నేను కాన్కలిడిన
'పంచశీల' సూత్రమ్ముల
వంచించెను వ్యర్థుడొకడు !
అది మొదలుగ

మది కలతల పాలై
నది..... పాపమింతె!!
వే ప్రేమించిన నగములు
నే ప్రేమించిన నదములు
నే ప్రేమించిన మనుజులు, నా
అన్నలు, నా అనుజులు
నా ప్రేమను శంకించగ
యా మమునన్ను జూచి
నవ్వుచుండెనా యేమది:
నా సేవల దరియించిన
ఆసియా చరిత్ర నన్ను
విస్మృతీ గుహా గహ్వ
రస్మృతి కంకితమీకమున్నె
నా కీరితి దిగ్దిగంతములకు
ప్రాకియుండగనే
నన్ననుగ్రహించరాదొ!
నన్ను స్వీకరించరాదొ!!
పంచశీల ప్రభావమో!
పంచభూతములు మిత్రులో!!
ఏమిటి ఈ నిర్వేదము?
ఇంతరాత్రి ఈ ఖేదము?
తొలుత ఎన్నడెరుగనట్టి

కలతలేల కలుగవలసె ?

పిటికి పందయట్లు నేసు

మరణము నాహ్వానించితిని !

.... .... ....

ఆయువధికమట పాపికి.... కావుననే తా

యయుత్సగలిగియుంట సహజమౌను !

పోరాడక చివర వరకు

కోరుకొందునేల చావు !

ఏమిటి ఈ నిర్వేదము ?

ఇంత రాత్రి ఈ ఖేదము ?

వింతగొలుప వినిపించెడు

గొంతుల గురుతులు గాలిలో

కొంత దొరుకుచున్నవిపుడె !

వా ప్రేమకు తగిలిన ఆఘాతమె ఈ

యామమట్టు నన్ను జూచి ఈ రాతిరి

నవ్వుచున్నయన్నట్లున్నది !!

(దేశ ఉత్తర సరిహద్దుల్లో దాడి జరిగినప్పుడు పండిట్ నెహ్రూ మాన సిక వ్యధ నూహించి)



# అనువాదాలు

అడిగినంతన యభిమానమంతరించు
తీరినంతనఁ గోర్కె తీవ్రత నశించు
నిరహమందున విహితము ముద్బుద్ధమగును
వీక్షణమ్ముగ నన్వేషణంత మొందు!
మద్యమేటికి మధురిపుడుండియుండ
కలశ, కాధంబరీకల్ష్య మతని కనులు
ఎపుడు వచ్చునొ, ఎచట కే భంగిననుచు
ప్రాయమూనిన నా ప్రాణమెదిరి చూచు?

ఎవరు సృజియించి నారేటికనెడుఁ బ్రశ్న
కెంత శోధించినను యేమి బదులు రాదు.
మూలనేడనోనేబడి మూల్గుచుండ
ఎవరు బిలిచిరదేటికి ఎఱుగనైతి
సుప్తలోకాలనే సుఖనిద్ర నుండ
ఎవరు మేల్కొల్పిరేటికి ఎవడు సెప్పు?
నిండు సభనుండి నిర్ధయత నిశ్వసించ
ఎవడు? ఎచ్చోటికీడ్చుక పోవునేడు?
రాకపోకల ఈ రభస కర్థమేమి?
ఎంత శోధించినను యేమి యంతువడదు!

రమ్య హర్మ్యాల మనసు రంజిల్లుగాని
ముద్రలేర్పడు పాదము మోపినంత!
ఐహికౌన్నత్య మఙ్గదు మంచిదేను
నీతి దప్పిననేగాని చేతికందు!!

ఈ ఎదన సృష్టిచే నేను దాల్చినాను
గుణగణనలేల ? నిర్గుణు దాల్చినాను
దుష్టుడను, ధూర్తుడను, దేబెనౌదుగాక !
తమరియాసతి యౌదల దాల్చినాను !!

చావు బ్రదుకులు నావి నీ కోసమేను
చచ్చినను బ్రతికినను నీ సమక్షమంచే !

పొసగినది భుజియించవలయును
ఒసగు దాతను దలువ వలయును !

విశ్వాసమున విశుద్ధాత్ముడై లోకాన
చరియించు నమ్జుదు సూఫియనగ !

(సూఫీ కవి సయ్యద్ అహ్మద్ హుసేన్ "అమ్జద్" కవితలకు - ఉర్దూనుండి)

ఊపిరున్నంత వరకోపగలను గాని
గోప్యమే గోలజేయ నేనేమి సేతు !!
'రానమాజుకు' 'రమ్మ' న వింటిగాని
పానశాలనే తెలవారె నేమి సేతు !!
వేయి యేళ్ళయిననే వేచియుందుగాని
ఆయువే అల్పమైన నేనేమి సేతు !!!

దైవమని వేడి తలవంచినాను గాని
చెవిని బెట్టని శిలయైన నేమి సేతు !!!!
జంటగూడితి సహవాస మెంచిగాని
జంటయే శత్రువైన నేనేమి సేతు !!!!!

(సౌన్ ఫొర్రైజ్డ్ కే మెహ్మాన్‌లో 'అన్వర్' ఉర్దూ కవిత వింటూ వెంటనేతెలుగు చేయడమైంది)

బాధలన్నిటి వంతు దీరెను బ్రదుక నింకేమున్నది ?
ఉన్నపళమున నూపిరాగుట యొక్కటే మిగిలున్నది !

(అసదుల్లా ఖాన్ గాలిబ్ ఉర్దూకు)



# అంధుడు

సూర్యచంద్రుల సుందరతా ప్రశస్తి
ఉదయకాంతుల యుషసి చీకట్ల క్రమము
వినును మాత్రమె కాని వీక్షించలేడు
మాపుకోలేక, మారాద లేక యతడు
జగతిఁ ప్రేమించు గాని చక్షువు నగనడు!

మదన జ్వాలాభినయమహా దీప్తియందు
శలభమట్టుల నాశన మందుగాని
తన్మహా తాండవద్యుతి జూడడతడు!
భక్తి యాతని భావననావహించ
దేవతా సన్నిధిన బ్రణమిల్లుగాని
ద్వార మెరుగడు సత్య ప్రధానుడతడు

తడబడుటలతని పనితన మొనరించకుండ
చిడిదుడుకు తోర్పుతో యొదిగిపోవు
తాను నడచెడిదారినే గానడతడు!

అతడు నవ్వుకొనుసు అత్మ సంతృప్తికి
ఒరుల జూచి యోర్వలేక గాదు
తన గార్చు కన్నీటఁ దడిసిన వలువనే
కానగా లేని కబోదియతడు!

కలిమి లేముల పరస్పర ఘర్షణము లెఱుగు
ఘర్షణా గత గర్జనముల వినును
కాని తత్ కపట నాటక దుష్ట దృశ్యముల్
కంట నిడుకొన నట్టి కర్మయోగి!

విశ్రమించుటకవిరామ జీవితమున
అతనికి వలయునాశ్రయ మొకడు నిజము
ఆశ్రయమ్మిచ్చి తన్నాదరించు నీడ
నుండునే కాని యబలాట పడను చూడ!

(సాహెబ్జాదా 'మైకష్' ఉర్దూ 'అంధా'కు తెలుగు)

ఈ సమస్తము స్వీయ సైజానువర్తి
దోసగాడును వగచి పునీతు డౌను
పదులు, వందలు, వేలైన నేమి యమ్జద్!
తుదకు శూన్యము దుడిచి పోనొకటె మిగులు!!

(సయ్యద్ అహ్మద్ హుసేన్ అమ్జద్ ఉర్దూకు)

ఆర్తియుప్పొంగ అన్ని నెలవులకు సెలవు!
సుఖము నుండుడు సోదరుల్ సెలవు, సెలవు!!

(బహదూర్ షా జాఫర్)

ధరణి నేలెడు వ్రాత వ్రాసి, తరిమి వేయగ జాలుదేవా!
తిరిపె మెత్తుక దేశమందున బ్రతుకు భాగ్యము వ్రాయలేవా?

(బహదూర్ షా జాఫర్ ఉర్దూకు)

ఉరికంబమెక్కించి ఉస్సురని యేడ్చేము
గురి చూసి కాల్చేసి గొల్లుమని యేడ్చేము!
రుజు మార్గమును జూపు నీతిపరులెల్లరను
తొలగించి, దారి దొరకక కుమిలి యేడ్చేము!

సత్తును హతమార్చి సైతాను దర దాల్చి
తప్పు జేసితి మనుచు దండిగా యేడ్చేము!
తల్లికి విషమిచ్చి త్రాచుకు పాలోసి
తలబాదుకొని చాల తల్లడిలి యేడ్చేము!

అమృత పాత్రనుఁ దన్ని హాలాహలము లేపు
వెట్టిగా చెయిజాచి వెక్కి వెక్కి యేడ్చేము :
సుఖ సౌధముల నెల్ల సొంతమే కూల్చుకొని
శిథిలాల జూచి కడు చింతించి యేడ్చేము :

నష్ట మేర్పడెనానంద నిధిని దాచ ;
అదియె పంచిననిసుమంతఁ దరగదాయె ::
కలవారికే సకల సుఖము లెల్లపుడు !
పూరిళ్ళె బూడిగా జూతు మెల్లప్పుడు ::

దీపశిఖ చుట్టు దూరాన దిరుగు గాని
శలభములకును కాలు సాహసము లేదు ::

బ్రదుకు నా మొదలొనేమొ చెప్పలేను :
చావు సారాంశమని మాత్రమొప్పనేను ::

వెలుగ వలెనను కోర్కె ఎదనున్నదే గాని
తమసుతో చెలిమి సమ్మతము గాదు :
సత్యము సమయాను వర్తియై చెల్లుట
తమకేమొ : నాకు సమ్మతము గాదు :
కామాతురతయందు, కన్నెయందము నందు
తగులమి నాకు సమ్మతము గాదు :

దారిబత్తము చెల్లిపోగా దారి మాత్రము గడవకున్నది :
బాటసారిని కలచి వేసెడు బాధ మాత్రము విడవకున్నది :

జన సౌందర్య భూషగా నేరడాయె !
వినయ సంపన్న విభవము నందడాయె !!
చనిరి యెందరో జనుల జాగృతమొనర్చి !!!
మనిషి మాత్రము మనిషిగా నేరడాయె !!!!

ఎన్నికల వేళ వాడెంత గొప్పవాడు !
ఓటున్న ప్రతి పౌరుడొక చక్రవర్తి !!
ఆ క్షణము గడచెనా అన్నార్తి వాడు !!!
తన దేశమున తానె శరణార్థి వాడు !!!!
తానోడు నేతలను గెలిపించు జనత !!!!!
తనది తాఁగుడుచుటే గణతంత్ర ఘనత !!!!!!

ఉదయ మాశింతు పశ్చిమోన్ముఖుడనౌచు !
ఈప్సితమ్మేది ? యెటు జూచుచుంటిని నేను ?

యేది కోరిన నాకిట్టిదొరకు గాని
యేది కావలెనన్నదే యెఱుగ నేను !

నిర్జనమ్మున మనసు నిలవక జనావాసము జేరినే !
పరునివలె దిరుగాడు చుంటిని బంధు జనముల మధ్యనే !!

పెద్దలే ఇటు పీకదాకా త్రాగి సుద్దులు సెప్పగా !
'వద్దు వద్ద'ని పానశాలను వదలి వచ్చితి వెంటనే !!

(శ్రీ కాళోజీ కామేశ్వరరావు 'షాద్' గారి ఉర్దూ కవితలకు తెలుగు)



# కాలమా కడతేర్చరాదే! కాని కాలము రాకముందే!

కాలమా ! కడతేర్చరాదే ! కానీ కాలము రాకముందే !!
బ్రతుకు బరువై పోకముందే ! మెతుకు కరువై పోకముందే !
చేవ జచ్చుటకన్న ముందే చేయిజూచుటకన్న ముందే !
గుప్తహస్తము పట్టు విడవడి, గుట్టురట్టయిపోకముందే !! కాలమా.....
ఒకరులెమ్మని, ఒకరు పొమ్మని, ఉన్న చోటున ఉండనివ్వని
భంగపాటులు సైచి బ్రదికెడిపాడు కాలము రాకముందే ! కాలమా........
మధురభావన, మధుర భాషణ మందగించుటకన్న ముందే !
మంచి నా నడవడికపైనెదొ మచ్చ వచ్చుటకన్న ముందే !!కాలమా........
అంతరంగానందనిర్ఝరి ఆరిపోవుట కన్న ముందే !
మనసురంగులకలలనీనుట మానివేయుట కన్న ముందే !! కాలమా.....
ముదిమిపైగొన తరుణ హృదయము గొణిగిసణుగుటకన్న ముందే !
వదలి గర్వము దిగులుపైగొన దేవురించుట కన్న ముందే !! కాలమా.........
బ్రదికి పనియేమన్న భావన మదిని వేచుటకన్న ముందే !
నన్నునా లోకాన నెవ్వరు కానకుండుట కన్నముందే !! కాలమా....—
వ్యాధులొక్కుమ్మడిగనాకిట తిష్ఠవేయుట కన్నముందే !
బాధలన్నీ తమ ప్రతాపము ఏకమై చూపుటకు ముందే !! కాలమా....
కాలు, సేతులు, కనులు, చెవులు గతులుతప్పుట కన్నముందే !
పేరు, పేరున బిలిచినా పెడచెవిన్నిబెట్టుట కన్న ముందే !!కాలమా.....

(శ్రీ కాళోజీ రామేశ్వరరావు 'షాద్' గారి ఉర్దూ కవితకు)
"ముఝోలేజారీ ఖజా అయిసీ ఘడీ అనేసెపహ్లే"



# విషయ సూచిక



# తప్పొప్పుల పట్టిక

| పేజీ | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 5 | సైవుణి యెల్ల | సైపుణి యెల్ల |
| 8 | 5 | మనస్థాపానికి | మనస్తాపానికి |
| 10 | 10 | నేనేనాడూ ప్రాకులాడలేదు | ఏనాడూ నేను ప్రాకులాళ్ళేదు |
| 10 | 13 | చిరునవ్వు తొనుక | చిరునవ్వు తునుక |
| 10 | 15 | నమిలిమింగుతూంది | నమిలి మింగేస్తున్నది |
| 11 | 8 | ఏ జమిందారు మేడనో | ఏ జమిందారు పీడనో తప్ప |
| 13 | 13 | తలస్పర్శిగా | తలస్వర్శిగా |
| 15 | 13 | విలువున్నదీ | విలువున్నది |
| 16 | 2 | కలవనుకోలేదు | కలవనుకోలేను |
| 16 | 10 | చేస్తాను | చేసాను |
| 18 | 18 | లభించేడం | లభించడం |
| 22 | 6 | పండితమ్మన్యులు | పండిత, మాన్యులు |
| 23 | 10 | 5 | 15 |
| 28 | 20 | కవి | కది |

| పేజీ | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 29 | 6 | వాగ్దూషణమ్ | వాగ్భూషణమ్ |
| 30 | 4 | పాకి | సాకి |
| 30 | 6 | అజ్ఞాతాన్ని | అజ్ఞానాన్ని |
| 31 | 9 | లోన్తై | లోనై |
| 36 | 4 | చేసుకుని | ముంచేసుకుని |
| 36 | 16 | ఆగడం | అగాధం |
| 38 | 18 | వెధవ | వెధవల |
| 41 | 19 | చడినగాన | చనడిగాను |
| 45 | 6 | అధికమైనా | అధికమై |
| 47 | 10 | వ్రాయండి | వ్రాసి |
| 47 | 16 | రా | నా |
| 47 | 18 | సమీక్షంలో | సమక్షంలో |
| 48 | చివర | ఙనాన్ని | జవాన్ని |
| 52 | 15 | కానా | కాను |
| 53 | 4 | కోటేవాణ్నే | కోసేవాణ్నే |
| 55 | 1 | నీ నోరు కట్టేసిన కర్మ సిద్ధాంతంతో | కర్మ సిద్ధాంతంతో నీ నోరు కట్టేసిన |
| 57 | 10 | కప్పుకొను | కప్పుకొని |
| 59 | 9 | కానివ్వండి | కానివ్వకండి |
| 59 | 17 | బాధల్నే | బాధల్ని |
| 69 | 3 | గోతుల్లో నన్ను | గోతిలో నన్ను పాతిపడేస్తారనీ |